శ్రీ

రామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీ కోదండరామ శతకము



[illegible]

పాణ్యం లక్ష్మీనరసింహయ్యగారు

ఉయ్యాలవాడ

**1938**

రామవిలాస ముద్రాక్షరశాల, కర్నూలు.

—:0:—

కాపీరైటు స్వాధీనము
గ్రంథకర్తవి

వెల 0-8-0



# ప్రథమ ముద్రణము



ఈపుస్తకము వలయువారు ఈక్రింద నుదహరించిన చిరునామాకు వ్రాసి పొందగలరు.

శ్రీ పాణ్యాల లక్ష్మీనరసహాయ్య

[illegible] గ్రామా, కోవెలకుంట్ల తాలూకా,

కర్నూలుజిల్లా.

CHECKED

[illegible] విద్యాలయ గ్రంథాలయం

సంఖ్య ....19837

[illegible]





గ్రంథకర్త.

పాణ్యాం. లక్ష్మీనరసింహయ్యగారు,

ఉయ్యాలవాడ.

# పండితాభిప్రాయములు.

## ఓం నమః పరదేవతాయై.

కవితయు గానము నను కలాద్వయము మానవునకు సహజములై పండితపామర విభేదముం బాటింపక యానందము సంఘటించుట లోకవిదితము అందు సంగీతము శ్రవణకాల సహకృతానందమును సులువుగఁ గూర్చుట నిక్కమైనను బ్రహ్మానందసుఖమగు నానందము నొడఁగూర్చుపట్లఁ గవిత యెక్కుడనుటయు నది యాలోచనామృతమను సహృదయ జనోక్తి సాభిప్రాయ మనుటయుఁ దప్పదు ఆకవిత యాదికాలము నుండి నేఁటివరకును సకలభాషలయందును క్షణక్షణోపచయముం బడయుచు విశ్వశ్రేయోదాయకమై వెలయుచున్నను ఫలపరిగణనమున యశఃప్రభృతులు బహుప్రయోజనములు దోచుచున్నను "కాంతాసమ్మితతయోపదేశయుజే" యను మహాకవివాక్యఁ దత్త్వదృష్టిఁ బరిశీలింప నేపండితుఁడైన బ్రధానసిద్ధాంత మని యొప్పుకో వలసినదే.

కవితా నిర్వర్తనీయమగు నుపదేశము పట్ల నితరకవుల కంటె శతకకవులు మిక్కిలి కృతకృత్యులగుట వారియెడ సకలలోకమును గృతజ్ఞమై యుండఁదగును శ్రవ్య దృశ్య ప్రబంధములవలె గాక యాబాలగోపాలము వాడుకకెక్కి లౌకికాలౌకిక ధర్మములు జనుల కుద్బోధించు నీతెగలోని కావ్యములలో లౌకికములకే మిగులఁ బ్రాధాన్యము.

పరిష్కృతము బ్రహ్మశ్రీ ఉయ్యాలవాడ పాణ్యాం లక్ష్మీ
నరసింహయ్య గారు రచించిన శ్రీకోదండరామశతకము నా
మూలాగ్రము నేను జూచితిని అందలి ప్రధానోద్దేశము మా
నవ నైతిక జీవనముఁ జక్కపరచుటయే అకార్యము తత్
తాత్కాలిక బాహ్యాభ్యంతర ప్రచోదనముం బట్టి ప్రాచీనకవులచేఁ
బూర్వనిర్వర్తితమే యైనను నవనవప్రవృద్ధములై క్షణక్షణ
విపరిణామముం బడయుచు నవనాగరికతయను నామమున దాండ
వించు దురాచారపిశాచములఁ దొలఁగించు నెడఁ బ్రాక్కాలి
కములగుటం ప్రాచీనశతకము లసమర్థము లగుట యారసి
యాలోటు దీర్పఁ గవి యుద్యమించెనని తోఁచెడిని ప్రతిపద్య
మునందును వీరి యుత్తమాదర్శము తేటపడుచుండును లో
కమున కొంచపు నవంతానర్థపరంపరను గూర్చిన వీరి యను
తాపము ప్రతిబింబించును అద్దానిఁ జక్కఁబరుపవలె నన్నఁ బ
రమేశ్వరుని గొల్చుట నివేదించుకొనుటయే పరమకర్తవ్య
మని ఏకు సంఘటించిన యీ శిక్షకయే చెప్పక చెప్పెడిని వీరి
కవిత బలాద్రాక్షాపాకము కాక సహజ సౌందర్య భాసురమై
రసజ్ఞలోకమునకు ముదము గూర్చు ననుట యతిశయోక్తి కా
జాలదు తమ దోషజ్ఞత యాత్మవిషయమున నెట్టిదైనను పర
కృతులయందు మాత్రము దోషైకదృక్కులై మెలఁగువారి
కిచ్చోట నైనను దోసంగులు గన్పట్టుట సహజము గాన
నిందును వారికవకాశము మొగవు నేమో కాని గుణజ్ఞులకు
మాత్రమీ కవిత శతకమును బరిశీలించుకొలఁది నట్టివృష్టి తో
లఁగక మానదు విషయమును బట్టి పండితపామర జనవేద్య
మగు భాషయే యిక్కావ్యమున కవసరమని వీరు చక్కఁగా
గ్రహించిరి ప్రస్తుతకాలమున నిట్టి కావ్యములే యవసరమగుట

నిక్కవివర్యుఁడును వీరి తెగవారు నుత్తరోత్తరాభివృద్ధి బడయుచు లోకోపకారము నెడ నాత్మప్రజ్ఞ నుపయోగించుచుఁ బరమేశ్వరుని కరుణాకటాక్షములకు బాత్రు లగుదురు గాక.

కర్నూలు.
29-6-38.

మేడవరం రామబ్రహ్మ శాస్త్రి
సంస్కృత పండితుడు.
మున్సిపల్ హైస్కూలు.

---

చ॥ కవివరులందు నేడు శతకంబులు వ్రాయు సమర్థులల్పము
ట్లవుట నవీన మార్గముల నాశతకంబు రచించి ప్రాజ్ఞ లో
కవినుతిఁగొన్న మిమ్ము నిపుడు గట్టిగ సంస్తుతి సల్పుటొప్ప దే
నవనవ కల్పనాభిరత సచ్ఛదోకోనరసింహ సత్కవీ॥

తే॥ గీ॥ పండితకవీంద్రు లెందఱో 'భళిర' యనుచు
బొగడియున్నారు దానమీ పొలుపు దెలిసె
శతకరచనకుఁ గ్రొంగ్రొత్త సొరులబ్బ
జేయుటల్పంబె? లక్ష్మీనృసింహ సుకవి॥

ఇట్లు,

కర్నూలు.
29.6.38.

శతావధాని అనుముల
వెంకటశేషకవి.

---

కవితయన నిట్టిదని దాని స్వరూపమును నిర్ణయింప గలవారు లోకమునఁ బెక్కండ్రుగలరు. కాని యొకని నిర్ణయము మఱియొక నిర్ణయమునకెప్పుడును భిన్నముగనేయుండును విమర్శకుడు దనకునచ్చిన మార్గము నొక్కదానినిమాత్రమే ప్రధానముగా మనము నందిడుకొని చర్చించుచో సత్యమెన్నటికిని బయలుపడదు. కావుననే "కాపి కాపి సరస్వతీ" అని యభిజ్ఞులునుడువుచుందురు. కావ్యమునందు గవియొక్క హృదయము సతనితాత్కాలికావస్థయు సూక్ష్మముగ బ్రతిఫలించుచునే యుండుననుటయు జాలవఱకు సత్యమే.

బ్రహ్మశ్రీ. వే. పాణ్యాం నక్ష్మీనరసయ్యగారు రచియించియున్న శ్రీ కోదండ రామశతకమును నేనామూలచూడముగా జదివిపరిశీలించితిని యిందువారి తాత్కాలికావస్థయును గొంతవరకు బ్రతిఫలించినది. అచ్చటచ్చట దమహృదయావేదనను భగవత్సన్నిధానమున తెలుపుకొనినట్లు కానవచ్చెడిని అయినను ముఖ్యముగ నేటినవనాగరకత యొక్క విచిత్ర పరిణామములను వానియనర్థములను లోకమునకు వెల్లడిచేయవలయునను పట్టుదల యిందు బ్రధానముగ గానవచ్చుచున్నది. ప్రకృతకాలమున నిట్టికవిత్వమే నిరివిగా నుదయింపవలసియున్నదని నాయభిప్రాయము అందును శతకరచన కిట్టి సమకాల వర్తనములు విషయభూతములగుట యెంతయు శ్లాఘ్యము తొల్లింటికొన్ని శతకములు తనయుత్పత్తికాలము యొక్క చరిత్రమునకిప్పుడెట్లు సాధనములగుచున్నవో యిప్పటి యీశతకము నైతము భావికాలము వారికీకాలపు జరిత్రమును బోధింపఁగల యుత్తమసాధనముగా గలదని నేను

నమ్ముచున్నాను. ఇట్టియుత్తమ శతకములను మఱికొన్నింటిని సైతమురచించి విజ్ఞులహృదయముల నానందవారిధి నోలలాడించుచు సకలజనులలోనే దేనియుచితమైన భావపరివర్తనము గలిగింప సీలక్ష్మీ నరసింహయ్యగారికి పరమేశ్వరుడా యురారోగ్య భాగ్యములొసంగి రక్షించుగాక.

ఇట్లు,

కర్నూలు.
27-6-38.

అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రి
తెలుగు పండితుడు.
మునిసిపల్ హైస్కూలు కర్నూలు.
శ్రీమాన్.

---

బ్రహ్మశ్రీ మేడవరం రామస్వామిశాస్త్రిలగారి అభిప్రాయం

చ॥ అమరధు నీసవీనవి కచాబ్జ మరందర సప్రసారిమై।
క్రమమున జాలువారెననగా భవదంచిత కావ్యమార్యచి
త్తములప్రమోదవారిధిసుధామయవీచికలందు రామనా
మమువలెదేల్చుచున్న యదిమాన్యగుణాకరసుప్రసిద్ధమై

ఇట్లు,

కర్నూలు,
30-6-1938.

మేడవరం రామస్వామిశాస్త్రి,
పౌరాణికకేసరి
సు॥ కేసులగ్రామం
మార్కాపురం తాలూకా.

## హైకోర్టు వకీలు వి. రత్నసభాపతయ్యగారి అభిప్రాయము

బ్రిహ్మశ్రీ

ఉయ్యాలవాడ పాణ్యం లక్ష్మీనరసింహకవి గారిని చాలాకాలమునుండియు నేనెరుగుదును, వారు వ్రాసిన కోదండరామ శతకము నామూలాగ్రము జదివితిని. మిక్కిలి సంతసించితిని శైలిసులభమైన చక్కనితేట మాటలలో నిర్దుష్టముగ నలరారుచున్నది. యిందు భక్తిజ్ఞాన వైరాగ్యములు, వర్ణాశ్రమధర్మములు నవనాగరకతా స్వరూపము లోకచర్యలు మొదలగునవి చర్చింపబడినవి. యిప్పుడు సంఘసంస్కారమను పేర శృతి స్మృత్యైను గుణ్యములగు పూర్వ సాంప్రదాయములనన్నిటిని దారుమారు చేయుచుండు యీకాలమున నిష్ట సనాతనధర్మావలంబములగు గ్రంథములు వ్రాయువారరుదు. యిందు బాహ్యాచార పరాయణత్వము చక్కగ వ్యక్తీకరించబడినది. కొన్ని చర్చలయందు కొందరికి మనస్సంకటములుగనున్నను లోపములను నిష్పక్షపాతముగ చర్చించిరే కాని యేకులమునుగాని యేవ్యక్తినిగాని యేసంఘమునుగాని తూలనాడుట వారిస్వభావముగాదని వారిని సంపూర్ణముగ నెరింగినవారెల్లరు నంగీకరింపకపోరని నావిశ్వాసము. యీగ్రంథపఠనమువల్ల గొందరైనను నీతిమార్గము నవలంబించినచో కవి పరిశ్రమ సాఫల్యమొనరించిన వారగుదురు. రాయలసీమవాసియైన యీకవిగారికి పండితులెల్లరు దగిన ప్రోత్సాహాదరణము లొసంగి గ్రంథరచనోన్ముఖుని జేయుదురుగాత కవిగారికి భగవానుడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యములొసంగి రక్షించుగాత.

కర్నూలు,
15-10-1937.

ఇట్లు,
వి. రత్నసభాపతయ్యగారు
హైకోర్టు వకీలు, కర్నూలు.

## రాచర్ల గ్రామం వై. రాఘవాచార్యులవారి అభిప్రాయం.

గీ॥ తనర సుంకర్యలవాడ కో । దండరాము।
శతకము రచించి యాంధ్ర బా । షా వధూటి
నవ్యరీతుల గై సేసి । నవరసముల।
చవులమరిగించి ధర్మాను । సారమెదల
భవ్యరీతుల బ్రజకుఁ జొ । ప్పడఁగఁ జేసి।
వాగ్విలాసామృతరసపు। వైభవంబు।
ప్రాజ్ఞలోకంబు కర్ణపూ। రంబుఁ జేసి।
సకలజనముల మెచ్చులఁ। సంతరించి।
జననిరాయలసీమయు। త్సాహగరిమఁ।
జెలఁగఁ జేసితి లక్ష్మీనృ। సింహసుకవి।

ఇట్లు,

కర్నూలు,
28-6-1937.

వై. రాఘవాచార్యులు,
సీనియర్ తెలుఁగు పండితులు
మునిసిపల్ హైస్కూలు, కర్నూలు.



# కృతజ్ఞత

గీ॥ పాత్రమును సాంతముగ జూచి పొలుపుమీర।
మంచభావంబులొసగిన మాన్యులకును।
గ్రంధమును సంస్కరించిన కవివరులకు।
సంతతంబును భక్తినంజలియొనర్తు॥

---

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# విజ్ఞప్తి.

చదువరులారా!

శ్రీమదనంత విచిత్రవిలాసాన్వితంబైన యీ ప్రపంచమున ధర్మాధర్మముల కెప్పటికి పరస్పరసంఘర్షణ మేర్పడుచుండుట ప్రసిద్ధమైయున్నది. యీ ధర్మాధర్మములనే శ్రీమద్భగవద్గీతయందు శ్రీకృష్ణ భగవానుడు దైవసంపత్తి ఆసుర సంపత్తి యని పేర్కొనియున్నాడు. ఈరెండింటి సంఘర్షణమందు నొకప్పుడు ధర్మమునకు, నొకప్పుడధర్మమునకు విజయము చేకూరుచుండును. సంపూర్ణధర్మాధిక మైన కాలము కృతయుగమనియు, అధర్మాధిక మైన కాలము కలియుగమనియు నీ తారతమ్యమును బట్టి త్రేతా ద్వాపరయుగములనియు పేర్కొనబడుచున్నవి. ధర్మము, భగవత్స్వరూపము, ధర్మాచరణము, భగవత్సేవయేయగును. ధర్మమునుద్ధరించుట భగవత్కృత్యమైయున్నది. శ్రీమద్భగవద్గీతయందు, భగవానుడు

శ్లో॥ యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానంసృజామ్యహం। అనియు

శ్లో॥ పరిత్రాణాయసాధూనాం। వినాశాయచదుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ। సంభవామియుగేయుగే॥

అని సెలవిచ్చియున్నాడు.

అనగ ధర్మమున కెప్పుడెప్పుడు హానిసంభవించి అధర్మము విజృంభించునో, అప్పుడపుడు తానవతరించి ధర్మోద్ధరణ మొనర్తుననియు, సాధురక్షణార్థము దుష్టశిక్షణార్థము, ధర్మ

సంస్థాపనార్థము ప్రతియుగమునందును తానవతరింతుననియు సెలవిచ్చియున్నాడు. ధర్మోద్ధారణమునకై మహామహులెందరో తమజీవితముల నర్పించియున్నారు. అర్పించుచున్నారు. ధర్మాచరణము, ప్రతిమనుజుని ముఖ్యకర్తవ్యమైయున్నది. ఇంతవరకు అంతవివాదాంశముకాని సంశయముకానిలేదనియే, చెప్పవచ్చును కాని ధర్మమనగనెట్టి-, అధర్మమనగనెట్టిది అను విషయమున మాత్రమే, "యెవరికివారే యమునాతీరే" యన్నట్లు భిన్నభిన్న వ్యాఖ్యానములు, భిన్నభిన్న సిద్ధాంతములు, చెందేగి వాద ప్రతివాదములతో సంకుల సంఘర్షణ మేర్పడుచున్నది. వాస్తవముగనొక కార్యము కొందరకు పరమధర్మముగను మరికొందరకు అధర్మముగను తోచుచుండుట మనకు ప్రత్యక్షమైయున్నది. ధర్మము నిర్వచించుటకు వేదశాస్త్రాది ప్రమాణములెన్ని యున్నను విమర్శకులకు సత్వరజస్తమో గుణభేదములచే నైశ్చిత్య సిద్ధింపకున్నది.

శ్లో॥ అధర్మం ధర్మమితియా। మన్యతేతమసావృతా।
సర్వార్థాన్ విపరీతాంశ్చ। బుద్ధిస్సాపార్థ తామసీ॥

కనుక, అధర్మము ధర్మముగా తోచుట ధర్మప్రమాణములకు విపరీతార్థములు, స్ఫురింపజేయుట తమోగుణాన్విత బుద్ధిలక్షణమని, గీతయందే పేర్కొనబడినది. అధర్మమునాచరించువారిని మూడువిధములుగ, విభజింపవచ్చును 1. అధర్మమునే ధర్మమని నమ్మిచేయువారు, 2. తెలియక చేయువారు, 3. తెలిసియు, విషయలంపటులై చేయువారునైయున్నారు. వర్తమానకాలము కలియుగము, ధర్మము గోచరించుట,

గోచరించినను ఆచరించుట బహుదుర్ఘటమైయున్నది. ఇది గాక కొన్ని సామాన్యధర్మములు. వర్ణధర్మములు, ఆశ్రమ ధర్మములు, దేశధర్మములు, ఆపద్ధర్మములు, ఇత్యాది భేదములచే ధర్మములొప్పుచున్నవి. ధర్మాధర్మ వివేకమునకు మూలములు. శ్రుతులు, శ్రుత్యర్థములు, సామాన్యులకు తెలియనందున మహర్షులు శ్రుత్యనుగుణములగు స్మృతులను రచించిరి. గనుక మన్వాది ధర్మశాస్త్రములు మనకు వేద తుల్యములై పరమప్రమాణములై యున్నవి. ఇవి ప్రమాణములుగ నంగీకరింపనివారితో మనకుప్రసక్తిలేదు. భగవద్గీతయందు భగవానుడు,

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రంప్రమాణంతే ।
కార్యాకార్య వ్యవస్థితౌ ॥ అనియు
శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్యవర్తతే కామకారతః ।
నససిద్ధిమవాప్నోతి నసుఖంనాపరాంగతిం ॥ అనియు

అనగ, కార్యాకార్యము చేయవచ్చునా, కూడదాయను విషయమున శాస్త్రము ప్రమాణము, ఎవడు శాస్త్రవిధినివిడిచి వర్తించునో వానికిగతిలేదు. సుఖములేదు. అని సెలవిచ్చియున్నాడు. కాని భగవదుద్దేశమునందున్న శాస్త్రమెద్ది అను విషయమున సంశయ ముదయించుచున్నది. కాని గీతాసమ్మతమైనశాస్త్రము మనుస్మృతియని భావింప నవకాశము గలదు. ఎట్లన గీతకు యోగశాస్త్రమను పేరు ఖ్యాతి నందియున్నది. యోగమనగ శ్లో॥ యోగః కర్మసుకౌశలం॥ అని గీతయందే చెప్పబడినది. ॥అనగ॥ కర్మలచేయుటయందలి కుశలత్వమే యోగమని అర్థము. అట్టి యోగశాస్త్రమును

భగవానుడు మొదట వివస్వంతున కుపదేశించినట్లును, వివస్వంతుడు మనువుకు చెప్పినట్లును మనువు ఇక్ష్వాకున కుపదేశించినట్లు గీతయందే చెప్పబడినది.

శ్లో॥ ఇమంవివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయం।
వివస్వాన్ మనవే ప్రాహమనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥

అనుటవల్ల మనుస్మృతి ప్రామాణ్యము సిద్ధమగుచున్నది. ఇదిగాక ॥శ్రు॥ యద్వైకించమనురవదత్తద్భేషజం॥ అని శ్రుతులు కూడ మనుస్మృతినంగ్గీకరించినవి. అట్టి మనుస్మృతియందు సర్వధర్మములు విపులముగ చర్చింపబడినవి, కాని నేడుజరుగుచున్న ఆచారవ్యవహారములు ధర్మములు తారుమారైనవి. వేయేల! సర్వసామాన్యములైన అహింస, సత్యము, అస్తేయము దయ, శాంతి, ఇత్యాది ధర్మములే శిథిలావస్థనందుచున్నవి. ఇది కలిస్వభావము. స్కాందపురాణాంతర్గత బుధవారవ్రతకథయందు

శ్లో॥ ఆచండాలమనుప్రాప్తా స్సర్వేవాణిజ్యకర్మణి ॥
శ్లో॥ సర్వేచండాలతాంయాంతి ॥
శ్లో॥ విప్రాణాంతపసస్త్యాగోనాభూన్మహాత్మ్యదర్శనం ॥
శ్లో॥ తత్రాపిసత్కర్మకర్తారః। క్లిశ్యమానాదినేదినే ॥
శ్లో॥ జాతనాంకర్మ యోగేపిచకుస్సత్కర్మకించన ॥
శ్లో॥ కలౌత్వబ్దసహస్రాణి యావత్పంచగతానిచ।
విష్ణుస్సత్యక్ష్యతిభూలోకం గంగాత్యక్ష్యతిభూతలం ॥
ధార్మికః కష్టమాప్నోతి। పాపిష్ఠస్సుఖమేధతే।
అద్యప్రభృతాధిరాజాతాః కలౌవింశతివత్సరాః ॥

అనూచానకులంనష్టం । వేదోనష్టశ్చసత్పథః ।
ధర్మోనష్టఃకర్మనష్టం । జాతోభూద్వర్ణసంకరః ॥

శ్లో॥ బహూన్యస్పష్టపూర్వాణి దుస్సాధ్యానినరైః క్వచిత్ ।
శిల్పానిసంప్రదర్శ్యైవకురాజా వంచయ తిప్రజాః
సర్వథా వైదికీవృత్తిః భవతామద్యదుర్లభా ।

ఇత్యాద్యనేక శ్లోకముల కలియుగప్రభావము నుగ్గడించ బడినది. వానినన్నియునిటజూపుట విస్తరమగును. పై వాక్యముల తాత్పర్యమేమన:- కలియుగమందు అగ్రవర్ణము మొదలు అంత్యవర్ణమువరకు జనులందరూ వ్యాపారవృత్తి నవలంబింతురనియు, సర్వజనులూ చండాలతనందుదురనియు, విప్రుల తపస్సులకు మాహాత్మ్యముండదనియు, సత్కార్యాచరణులు దినదినము సంకటపడుచుందురనియు, జాతిసాంకర్య మేర్పడుననియు, అయినను సత్కార్యాచరణము కొద్దిగ చేయుచుందురనియు, కలియుగమందు 5000 సంవత్సరములు గడచిన విష్ణువు, గంగయు, భూలోకమును విడుతురనియు, ధార్మికుడు, కష్టమందుననియు పాపిష్ఠుడు సుఖపడుననియు, కలియుగమందు 5020 సంవత్సరములు గడచిన ఉత్తమకులము వేదము, మంచిమార్గము, ధర్మము, సత్కర్మయు, నష్టమగుననియు వర్ణసంకర మేర్పడుననియు పూర్వమందు చూడనటువంటి దుస్సాధ్యములైనటువంటి యంత్రములను వ్యాపింపజేసిదుష్ప్రభువులు ప్రజలను మోసగింతురనియు వైదికవృత్తి దుర్లభమగుననియు మొదలగు సంగతులచే వర్తమాన పరిస్థితులను వేలయేండ్లకు మునుపే మనమహర్షులు వ్రాసియున్నారు. అయిన మనమిప్పుడేమిచేయవలె, కాలప్రవాహమునకె దురీత

నీమట సాధ్యము కాదనుసంగతి తెలిసినదే అయినను మిన్న కుండరాదు. ప్రస్తుతము జరుగుచున్న సంఘసంస్కరణలు వర్ణాశ్రమధర్మసాంకర్యములు పంచమదేవాలయప్రవేశాదులు మొదలగునవి ధర్మములు మాత్రము కాజాలవు. అని నిగా పించి యథాశక్తి పాటుబడుట ధర్మము. భగవానుడు కలియుగమందు శ్లో॥ యథాబలం యథాయోగం। తత్సర్వా నుగమంభవేత్ । అని సెలవిచ్చియున్నాడు. అయినను నీ ధర్మాధర్మచర్చ పండితులు చేయతగినది.

నాబోటివానికి దుస్సాధ్యము. అయినను వ్యాకరణ గతాభిప్రాయముల పుస్తకస్వరూపమున వెలిబుచ్చుట యుక్త మేయని తలచి మొదటనీశతకమును ॥కలితదుష్కృగనికుంబకలయుగంబ॥ యను మకుటముతో కలినిభోధించి కొన్ని పద్యములు వ్రాసితిని. కాని పిమ్మట అనుల్లంఘనీయమగు దైవిక ప్రేరణమువల్ల నా యిష్టదైవమగు శ్రీకోదండరామ మూర్తిని సంభోధించి మార్పుచేసితిని. ఇందులోనే వ్యక్తిని గాని యేకులమునుగాని యేసంఘమునుగాని తూలనాడుట నా యుద్దేశముకాదని శ్రీరామచంద్ర సాక్షిగ వచించు చున్నాను. నేనువ్రాసినవిధర్మములైనను కాకున్నను ధర్మము లను నమ్మకముతో వ్రాయబడినవే కాని వేరుకాదు. నాకు తోచినంతవరకు కఠినపదములను వాడక వ్యంగ్యభావముల విడక అందరకు సులభముగనుండునట్లు వ్రాసితిని. నీతిభోధక గ్రంథములలో శతకములు కూడ మిక్కిలి ప్రచారములలో నున్నవని శతకరూపమునే కల్పించితిని. ఇందుదోషములున్న ను స్ఖాలిత్యములున్నను నాకు తెలిపిన కృతజ్ఞతతో గ్రహించి సవరింతును. పండితులు అనుగ్రహాదరణములో సంగి మన్నింతు

రుగాక యని వేడుచున్నాను. ఈశతకమును సాకల్యముగ పరిశీలించిసంస్కారమొసంగిన నాపరమమిత్రులగు బ్రహ్మశ్రీ కవిసింహ అవధాని పంచాననేత్యాది బిరుదాంకితులును, శతావధానులగు ప్రొద్దుటూరు గాడిపం రాజశేఖర వెంకట శేషకవిపుంగవులకును, కర్నూలు మునిసిపల్ హైస్కూల్ పండితులగు శ్రీమాన్ రాచర్ల రాఘవాచార్యులవారికిని నా కృతజ్ఞతాభివందనము లొనర్చువాడ మఱియు ముద్రణాది కార్యములకు సహాయమొనర్చిన భక్తులకు కృతజ్ఞతజూపుచు, సర్వజనులకు ధర్మాసక్తియు దైవభక్తియుగలిగించి భోగభాగ్యములొసంగి శ్రీరామచంద్రమూర్తి రక్షించుగాక.

శ్రీ రామార్పణమస్తు.

సర్వేజనాస్సుఖినోభవంతు.

ఇట్లు, విన్నవించు

బుధజనవిధేయుడు

14—10—1937
ఉయ్యాలవాడ.

పాణ్యం లక్ష్మీనరసింహయ్య.

శ్రీగణేశాయ నమః
శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

సీ॥ శ్రీమదహోబల । స్వామినారాధించి ।
విఘ్నేశు నెంతయు । వినుతిఁ జేసి ।
శారదాదేవికి । సాష్టాంగమొనరించి ।
గురుపులకంజలిఁ । గదుబు ఘటించి ।
వ్యాసవాల్మీక్యాది । వరకవీంద్రులఁ గొల్చి ।
యాంధ్రకవీంద్రుల । నభినుతించి ।
నేఁటికవీశ్వర । కోటినెంతయు మ్రొక్కి ।
కుకవులమది లెక్కఁ । గొనక దెగడి ।
తే॥ గీ॥ తల్లిదండ్రుల మదిలోనఁ । దలఁచి పద్య ।
శతకమర్పించెదను భక్తి । సమ్మతించి ।
శాశ్వతానందపదవినో । సంగవయ్య ।
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 1

సీ॥ శ్రీరమ్యగుణధామ । శృంగారజితకామ ।
కారుణ్యసీమరా । క్షసవిరామ ।
రాజలలామమా । ర్తాండవంశాంబుధి ।
సోమదాక్షాయణీ । స్తుత్యనామ ।
మానితామరభక్త । మానసాంబుజతిగ్మ ।
ధామశత్రుగ్రసం । గ్రామభీమ ।
యతిలోకహృదయావి । హారాభిరామభూ ।
తనయాప్రమోదసం । ధానభూమ ।
గీ॥ నవ్యనీలాంబుదశ్యామ । నన్నుఁ బ్రోవు ।
మోదములొసంగుచును దయా । స్ఫూర్తినోమ ।
భక్తినినుఁ గొల్తు నెపుడు కై । వల్యధామ ।
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 2

సీ॥ తిగతిగమగరాల । బిగిబిగికడుదూల
సొగసగుతగుసిగ । సొమ్ముతోడ
పలుకుపలుకున తేనె । లొలుకుచుగులికెడి
మొలకనవ్వులముద్దు । మోముతోడ
చెలువగుకలువరే । కులనిగ్గుదులకించు
కలుములీనెడువాలు । గనులతోడ
క్రొక్కారుమీరుదా । రులబారుసిరితారు
మారొనర్చెడిమేని । సౌరుతోడ
తే॥గీ॥ వలిపెమగుపచ్చపట్టుదు । వ్వలువతోడ
విరులదనరారుమురిపెంపు । సరులతోడ
నెదనువదలకనిల్వగో । రెదనుదేవ
ధరణినుయ్యాలవాడకో । దండరామ॥ 3

సీ॥ ఔకమూలాంబకు । నరయుఁగఁతూర్పునఁ
గరముకొండామడఁ । బరగునెద్ది
వినుతమహానంది । కినిదక్షిణంబునఁ
బరగమూడామడ । వరలెనెద్ది
శ్రీమదహోబల । స్వామికిపశ్చిమం
బునను రెండామడ । దనరెనెద్ది
కడుపవిత్రంబైన । గండికోటకునుత్త
రమున రెండామడఁ । గ్రాలెనెద్ది
తే॥గీ॥ యట్టిపావనమైనయు । య్యాలవాడ
పురమునీకునునాకుఁగా । పురముగల్గి
నన్నుఁజేపట్టకుండుట । న్యాయమగునె
ధరణినుయ్యాలవాడకో । దండరామా॥ 4

సీ॥ హరిభక్తికలితుండు । నరసింహభట్టాభి
ధానుండు మత్ప్రపి । తామహుండు
వేదాంతవేత్తయై । వెలసెనోబులభట్ట
నాముండు నాదుపి । తామహుండు
స్మార్తధర్మజ్ఞుఁడై । జగతిలక్ష్మీపతి
నాఁబ్రసిద్ధివహించె । నాదుతండ్రి
ప్రజ్ఞాన్వితుఁడు సుబ్బ । రామాహ్వయుండన్న
యనుజుండు వాసుదే । వాఖ్యశాలి
తే॥గీ॥ సుగుణనికరంబమా యంబ । సుబ్బమాంబ
భవ్యకౌండిన్యగోత్రసం । భవుఁడ నేను
పేరలక్ష్మీనృసింహుఁడ । వినతిసేతు
ధరణినయ్యాలవాడ । కోదండరామ 5

సీ॥ వామాంకతలమునఁ । బ్రమదంబుఁగొలుపుచు
సీతయాసీనయై । చెలఁగుచుండ
నగ్రభాగంబున । నాంజనేయుఁడుభక్తి
నంచితంబుగనుసే । వించుచుండ
వెనుకప్రక్కనునిల్చి । వేడ్కలక్ష్మణుఁడు శ్వే
తాతపత్రముఁబట్టి । యలరుచుండ
నిరుపార్శ్వములనిల్చి । భరతశత్రుఘ్నులుం
వింజామరలుఁబట్టి । వీఁచుచుండ
తే॥గీ॥ గోణములభానుజప్రము । ఖులుభజింప
భాసురంబుగమధ్యసిం । హాసనమునఁ
గొలువుఁదీర్చినని న్నెదఁ । గొలుతుదేవ
ధరణినయ్యాలవాడకో । దండరామ 6

సీ॥ నీమీఁదిభక్తిచే । నిఖిలకష్టములోర్వ
ప్రహ్లాదుఁడనుఁ గాను । పరమపురుష
నీ మహత్వముఁ దెల్ప । రామాయణము వ్రాయ
వాల్మీకి నేఁ గాను । భవ్యచరిత
నీదు కార్యమునకై । నిజతనువర్పింప
నే జటాయువ గాను । నిగమవేద్య
నిన్నుఁ గూర్చి తపంబు । నిష్ఠతో సలుపంగ
నే ధ్రువుండను గాను । నిర్మలాత్మ
తే॥గీ॥ నీపదద్వంద్వ మెదనెప్డు । నిలిపికొలువ
నాంజనేయుండఁ గాను ద । యార్ద్రహృదయ
నేరమెంచక గావనీ । భారమయ్య
ధరణి నుయ్యాలవాడకో । దండరాము ॥ 7

సీ॥ ఎపుడు నీరూపంబు । నీక్షించుచుందువా
కన్నులన్యంబులేఁ । గాంచఁగడఁగు
ననిశంబు నీకథల్ । వినుచుందుమందువా
వీనులన్యంబులే । వినఁగడంగు
సతతంబు నీపూజ । సలుపుమటందువా
చేతులన్యంబులే । సేయఁగడఁగు
కడఁగి నీనామమె । ప్పుడుఁ బల్కుమందువా
జిహ్వయన్యములెవ । చింపఁగడఁగు
తే॥గీ॥ నేమి సేయుదు నాగతి । యిట్టులయ్యె
నిన్నుఁ జేరెడిమార్గంబు । నీవ చూపి
దయను రక్షింపకున్న నేఁ । దాళగలనె
ధరణి నుయ్యాలవాడకో దండరామ ౮

మత్తేభవిక్రీడిత గర్భసీసము.

సీ॥ సుగుణరత్నాకర । శుభ్రకీర్తినికరా
ఘోరారినాశంక , రారమేశ
మ్యమణిసంకాశమ , హేమాజ్వలాభరణస
న్మౌనీంద్రసంరక్ష , నానరేంద్ర
ప్రగణనాతీతసు , భక్తభాగ్యఫలకా
కల్యాణసంధాయ , కాపరాత్మ
కరణశాంతారివి , కారకల్పితనయా
ప్రాంచత్ప్రభావోద , యాముకుంద
తే॥గీ॥ దేవతాకోటికోటీర , దివ్యరత్న
రాజిరోచిఃప్రకాండనీ , రాజితాంఘ్రి
పంకజద్వంద్వనిను । గొల్తుభావమందు
ధరణిముయ్యాలవాడ కో । దండరామ॥ 1

ద్విపదగర్భిత సీసము

సీ॥ నియతధర్మాచార । నిరుపమాకార,ప్రి
యమునిసత్కార,వీ । రాధివీర
సువిధసరోజినేంద్ర । సుఖితమౌనీంద్ర.భు
వనయశస్సాంద్ర,భూ । పాలచంద్ర
ప్రవిమలగుణాధార । రక్షఃప్రహార,ప
వనజమందార,భ । వ్యప్రచార
మనసిజరూపసం । భగ్నేశచాప,ఘ
ననిగమాలాప,జా । నకీప
తే॥గీ॥ యతినారద సమహాన భావ
విబుధజనహృద్యపరమార్థ । వేదవేద్య
భవ్యగుణశీలనన్నేలు । భక్తపాల
ధరణిముయ్యాలవాడకో । దండరామ॥ 2

సీ॥ వైకుంఠపురదివ్య । వైభవోన్నతభోగ ।
పరుఁడవైననుఁబ్రోవ । మఱచినావా ।
విధివిరామములేక । వేధించుచుండఁగ ।
వేసటఁగల్గెఁబో । విడచినావా ।
కలుషంబులొనరించు । కలికాలమిదియంచు ।
బూనిభక్తులఁబ్రోవ । మానినావా ।
ఘనభక్తినెవరైనఁ । గదలనీయకగడు ।
స్థిరముఁగాబంధింపఁ । జిక్కినావా ।
తే॥ గీ॥ యెంతవేడిననీకిసు । మంతయైనఁ ।
గరుణరాకుండుటకునేమి । కారణంబొ ।
తెలియఁగారాదునుంతయు । దేవదేవ ।
ధరణినుయ్యాలవాడకో । దండరామా ॥ 3

సీ॥ కోపమానేఁజేయు । పాపమానీదయఁ ।
జూపుమాయనివేడ । సుజనవినుత ।
భారమాలేక వి । చారమా నీకింత ।
వైరమా ననుబ్రోవ । శ్రీరమేశ ।
పంతమాయింతరా । ద్ధాంతమాసంసార ।
చింతమాన్పుమటన్న । చిద్విలాస ।
కష్టమాదరిఁజేర్ప । నష్టమాలేకయ ।
రిష్టమానీకిది । శ్రీనివాస ।
తే॥గీ॥ నీచమాదయఁజూచుట । నిర్మలాత్మ ।
యాచనాభంగమనురూప । మాధవేశ ।
యేలదయరాదు నేనింకఁ । దాళఁజాల ।
ధరణినుయ్యాలవాడకో । దండరామా ॥ 4

సీ॥ విశ్వేశనిన్ను సే ♦ వింపనికరంబులు
కరములాయవిపట్టు ♦ కార్లుగాక
శోభనాకారనిన్ ♦ జూడనికన్నులు
కన్నులాభల్లాత ♦ కములుగాక
యనఘాస్మనీకథల్ ♦ విననట్టిశ్రవణముల్
శ్రవణంబులాకొండ ♦ గవులుగాక
యోంకారరూపని ♦ న్న స్మరింపనిజిహ్వ
జిహ్వయాయదిపాశ్రి ♦ చెప్పుగాక
తే॥గీ॥ పరమపూరుషనిన్నుఁగొ ♦ ల్వనిమనుజుఁడు
మనుజుఁడా కాఁడు మోద్రడగు ♦ మాద్రినుగాక
జానకీరామదేవతా ♦ సార్వభౌమ
ధరణినుయ్యాలవాడకో ♦ దండరామా ॥ 5

సీ॥ రామాబ్దిదుష్టరా ♦ క్షసనికాయము నెల్లఁ
జెండాడఁగలలక్ష్మ ♦ ణుండు లేఁడొ
భక్తిమార్గంబునఁ ♦ గాపముల్ తొలఁగింపఁ
బండితుండగుభర ♦ తుండు లేఁడొ
యానుశారుల నెల్ల ♦ నిలఁదెగటార్చెడి
భుజశాలిశత్రుఘ్న ♦ మూర్తి లేఁడొ
సంసారవార్ధిని ♦ స్తరణంబొనర్పఁగ
నుత్తముండాంజనే ♦ యుండు లేఁడొ
తే॥గీ॥ దయనుఁబాలింపఁదల్లిసీ ♦ తమ్మ లేదొ
భయముతోఁ జెనుగంపెడు ♦ బలగమున్న
దండిశ్రీనీదయ లేకున్నఁ ♦ దాళఁగలనె
ధరణినుయ్యాలవాడకో ♦ దండరామా ॥

సీ॥ కాశీగయాప్రయా ♦ గలకేగఁగాఁ లేను
పుణ్యతీర్థములందు ♦ మునుఁగలేను
బ్రహ్మసూత్రార్థముల్ ♦ భావింపగాలేను
విబుధులభక్తిసే ♦ వింపలేను
స్వకులధర్మశ్రేణి ♦ జరియింపగాలేను
చిత్తశుద్ధిగపూజ ♦ సేయలేను
ఘనపుణ్యకార్యముల్ ♦ గావింపఁగాలేను
జపతపవ్రతములు ♦ సలుపలేను
తే॥గీ॥ దీనజనరక్షణానాథ ♦ దిక్కునీవ
పాపకర్ముఁడనీపాలఁ ♦ బడితిదేవ
యెటులనన్నుద్ధరింతువో ♦ యేమొత్రోవ
ధరణినుయ్యాలవాడకో ♦ దండరామా ॥ 7

సీ॥ నీసేవసంసార । నిమ్నపారావార
ఘోరపయోనిమ । గ్నులకునావ
నీపొందుమద్గుణ । నికరపీడాకర
వ్యాధులకెల్లవై । ద్యనమందు
నీపేరుఘనశాకి । నీఢాకినీత్యాది
గ్రహగణంబులకుఫి । రంగిబారు
నీప్రాపుదుష్కృత । నిబిడభీష్మాటవీ
శ్రేణులకెల్లకా । ర్చిచ్చుకోపు
తే॥గీ॥ నీజపంబాధిచయనళి । నీద్విపంబు
నీదుభక్తియెయాపణ । నిగళముక్తి
భక్తజనపాలజానకీ । ప్రాణలోల
ధరణినుయ్యాలవాడకో । దండరామా ॥ 8

సీ॥ పుట్టినిల్చియుడంగు | నట్టిప్రపంచ వి
లాసంబునీదుటా | కీసినీమ
అతివిశాలంబుగ | నావరించినయట్టి
భూనభోంతరమెల్ల | భానుహేలి
ఉదయాస్తమయముల | నొప్పెడిభానుండు
వెలుఁగయుడంగెడి | పెద్దలెటు
సకలపట్టణనదీ | సాగరారామాద్రి
కూటాదిదృశ్యంబు | లాటసీను
తే॥గీ॥ లహహ నవరసభరితమై | యలరిమాయ
యనెడి తెరయందుఁబడినసత్య | మనెడి భ్రాంతి
గలుఁగఁజేసెనుమూఢలో | కమునకెల్ల
ధరణిసుయ్యాలవాడకో | దండరామా॥ 9

సీ॥ తెరణికులేందిరానీ | దయలేకయున్నసం
సృతిమహాంభోనిధి | నీదుటెట్లు
ఘనదేహనీయను | గ్రహములేకుండిన
పాపాగ్నితాపంబు | వాయుటెట్లు
రాక్షసాంతకనీక | టాక్షంబులేకున్న
తలపురక్కసిపిండుఁ | దొలగుటెట్లు
ఖగరాజవాహనీ | కరుణలేకుండిన
విషయోరగవ్యాప్తి | విడుచుటెట్లు
తే॥గీ॥ శ్రీధరాసిదువాత్సల్య | సిద్ధిలేక
జ్ఞానదారిద్ర్యదుఃఖంబు | సమయుటెట్లుఁ
గాననేఁగానికన్న | గతిజగాన
ధరణిసుయ్యాలవాడకో | దండరామా॥ 10

సీ॥ చచ్చినవారికి । శ్రాద్ధముల్ బెట్టుట
తెలివితక్కువయని । దెగడువారు
రాళ్ళు దేవతలౌదు । రాతివిగ్రహ
పూజలమాన్పఁగ । బూనువారు
వాదించికులమత । భేదంబులెంచక
పానీయంబులు సేయఁ । బరగువారు
ఘన వేదశాస్త్రముల్ । గాలించితిమటంచు
మహితధర్మంబుల । మార్చువారు
తే॥గీ॥ తాము చెప్పెడినుడిముఖ్య । ధర్మమనుచు
దిట్టలై శాస్త్రార్థులఁ । దిట్టువారు
జెలఁగిరిప్పుడుకొంద । రీగలవిధాన
ధరణినయ్యలవాడకో । దండరామా ॥ 11

సీ॥ ఏకపత్నీవ్రతఁ । బేటిపాలొనరించి
వారకాంతలయిండ్లఁ । దూరువారు
నాలుబిడ్డలునింట । నన్నమో యనుచుండ
గనుపారహోటళ్ళఁ । గుడుచువారు
దనరాణిఁగోరెడి । తనయులవిడనాడి
కులటబిడ్డలముద్దుఁ । గోరెడివారు
నింటిలోఁ తలిదండ్రి । లేడ్చుచునుండఁగ
సానులకును బూజ । సల్పువారు
తే॥గీ॥ పురుషులీగతిదుష్కార్య । ములనొనర్చి
పాడుఁ జేసిరిమామిడి । పండువంటి
కాపురంబులనేమందు । కాలమహిమ
ధరణినయ్యలవాడకో । దండరామా ॥ 12

సీ॥ పట్టెడన్నముఁ బెట్టు । పరమహంసకిఁ బ్రియ
మిత్తునాకలిదప్పు । లెనఁగఁబోవు
పైసాయొసంగిన । బదనికనిచ్చెద
నధికసౌభాగ్యంబు । లందఁజేయు
రూకయొసంగిన । నీకుమూలికనిత్తుఁ
గోరికలెల్లనీ । డేరఁగలుగు
నైదు కూనీలాసంగు । మంజనమిత్తును
గాఢమహానిధులఁ జూసే । కూరఁగలవు
తే॥గీ॥ చూడుడనుచును మోసవు । జోగులెల్ల
తేనెలొలికెడిపలుకుల । దినదినంబు
ప్రజలవంచింపదొడగిరి । బహువిధముల
ధరణినుయ్యాలవాడ । కోదండరామా ॥ 13

సీ॥ కడుదెల్లనగు నెత్తి । కప్పునూనెలబూసి
గౌరవంబనిదుడ్డు । కట్టఁబూని
గూడుఁబోలిననోటఁ । గొట్టపండ్లమరించి
బూచికండ్లకునద్ద । ములఁదగిల్చి
మదనకామేశ్వర । మాత్రిలుసేవించి
యంగంబునకుఁగోటు । లమరవేసి
యనుదినంబునుక్షౌర । మాసక్తిగావించి
యాప్తునొక్కనిసహా । యంబుఁగోరి
తే॥గీ॥ కానిదేశంబులకుబోయి । కడపగడప
గన్యకలబేరమాడిరొ । క్కంబొసంగి
పెండ్లియాడఁదొడఁగిరి । వృద్ధులకట
ధరణినుయ్యాలవాడకో । దండరామా ॥ 14

సీ॥ కాఫి హోటళ్ళ సం । గతిఁ జూచినంతనే
కులధర్మపరులకు । గుండెలవియు
కులమేమియో బ్రాహ్మ । కుని వచింపగరాదు
"బ్రాహ్మణ హోటలు" । పలకలుండు
నదిగాంచినంతట । నన్నిజాతులవారుఁ
జేరికూర్చుండుదు । రేరులేక
యెంగిలిపాత్రల । నింతతిండియు కాఫి
నొసఁగరొక్క మొసంగి । మెసవుచుంద్రు
తే॥గీ॥ లోనజరిగెడిరోతల । లోతుదెలియు
నాసహస్రాక్షునకునైన । నలవియగునె
శ్రీహరీవాని విధమెల్లఁ । జెప్పజాల
ధరణినుయ్యాలవాడ కో । దండరామ ॥ 15

సీ॥ వేదశాస్త్రవిచార । విధులంతరించుట
లా కాఫిహోటళ్ళ మూ । లమునగాదె
కులమతాశ్రమ ధర్మ । ములు గూలిపోవుట
లా కాఫిహోటళ్ళ మూ । లమునగాదె
అతిథిసత్కార పూ । జాదులుమాయుట
లా కాఫిహోటళ్ళ మూ । లమునగాదె
అగ్రవర్ణంబుల । నధములుదూరుట
లా కాఫిహోటళ్ళ మూ । లమునగాదె
తే॥గీ॥ యవియు నివియనునేలనే । డఖిలధర్మ
ములనునిర్మూలన మొనర్ప । కలివసించు
గుళ్ళనగ వచ్చు కాఫిహో । టళ్ళనెల్ల
ధరణినుయ్యాలవాడ కో । దండరామా ॥ 16

సీ॥ తెచ్చునుఁబట్లాట । తిట్లాట గొట్లాట
నను భవించియు మాన । రైరిజనులు
పలువుకు మీనావు । సకలార్థములదోవు
ననుభవించియు మాన । రైరిజనులు
పోఁగొట్టినవరంజి । పూర్వముండినగంజి
యనుభవించియు మాన । రైరిజనులు
చేయునుబొమ్మాట । సిరి నెల్లనిలుదాఁట
ననుభవించియు మానరైరిజనులు
తే॥గీ॥ జగతిచీట్లాటచే నగ । చాట్లనొంది
కోట్లకొలది కుటుంబముల్ । గూలిపోయెఁ
దీనివ్యామోహ మే నిఁ । దెల్పగలను
ధరణినుయ్యాలవాడ కో । దండరామ ॥ 17

సీ॥ పరులచేతనుగొట్లు । భార్యచేఁజీవాట్లు
కొడుకుతో మెడపట్లు । పడినపాట్లు
కులధర్మమెగమీటు । కులసతియిలుదాటు
కలహంబులకుఁజోటు । కడకుజేటు
లోకంబుతోదూరు । రోకమెల్లనుజారు
కక్కుడుకంగారు । కంపునోరు
నలుగురుండెడుచోట । నమ్మరెంతయుమాట
నగుబాటులకువాట । మగునువీటఁ
తే॥గీ॥ నన్నికష్టంబులకు మూల । మైనయట్టి
కల్లుసారాయితో జగ । మెల్లనిండె
కలుషములుపండె బీదలకడుపుమండె
ధరణీనుయ్యాలవాడ కో । దండరామా ॥ 18

సీ॥ అగ్నిప్రమాదంబు । లధికంబుగావించు
ముఖముపై తేజంబుఁ । బోనడంచు
దినదినంబున దక్ష్య । మునుదండుగహరించు
దగ్గురోగములెల్ల । చాపరించు
నధరమ్ముపైనీలి । యాకురంగుదయించు
దడవైనబుద్ధిమాం । ద్యము జనించు
నవయౌవనమున షం । డత్వమాపాదించు
నంగపటుత్వంబు । లంతరించు
తే॥ నిట్టి పొగచుట్టలనుదాగి । యెపుడకాల
మరణములనందుచున్నారు । మహిని మనుజు
లార్యసంతతి నేఁడు ని । ర్వీర్య మయ్యె
ధరణి నుయ్యాలవాడకో । దండరామ 19

సీ॥ బ్రిదికి యుండఁగనే । పంక్తునందునఁబొగ
వెడలు నశ్లీలంబు । వాడముచుండు
ప్రాణప్రదంబైన । రక్తంబు లోపలఁ
గలసియెంతయుదాని । మలినపరచు
న[illegible] సౌఖ్యంబుల । కాలవాలంబైన
వీర్యంబు నెల్లను । విరుగఁజేయు
నాహారములజీర్ణ । మందఁజేసెసిబియువిస్మ
గారపోవంగనో । యూరఁజేయు
తే॥గీ॥ నిట్టిబీడీలు సిగరెట్లు । నెపుడు వాడి
యఖిలరోగంబులకును బా । త్రైరిమనుజు
లెట్టిదుష్ఫలములొదీని । నేలుఁగరాదు
ధరణినుయ్యాలవాడకో । దండరామా । 20

సీ॥ నస్యము సిగరేటు । నల్లమందుపొగాకు
బంగి సారాయంబు । బ్రాందికల్లు
జగమెల్లనిండియు । జనులయందుపిశాచ
మట్లావహించి చీ । కాకుపఱచి
పంచేంద్రియంబుల । బలమును ధనమును
వీర్యంబుబుద్ధివి । వేకములను
బోనడంచియురోగ । ములనెన్నియొాపెంచి
కష్టముల్ గలిగించి । కసుకుమించి
తే॥గీ॥ ప్రాణములదీయునందాక । పట్టువిడక
ప్రళయమొనరింపదొడగెను । ప్రజలనేఁడు
చెడ్డయలవాటులివి విస । ర్జించుటెట్లొ
ధరణినుయ్యాలవాడకో । దండరామా॥ 21

సీ॥ ప్రత్తిపండించియు । రాటంబులుంచియు
పరవస్త్రములెగట్ట । వలసెనేఁడు
గానుగల్ని డియు । నూనెధాన్యములుండి
పరదీపములుపెట్ట । వలసెనేఁడు
పశువులుచెన్నారి । పచ్చికలునుమీాఱి
పాలబుడ్లనుఁగోర । వలసెనేఁడు
చెఱకుపంటలుఁగల్గి । చేయువంటలువెల్గి
పరులచక్కెరవాడ । వలసెనేఁడు
తే॥గీ॥ భారతీయులబ్రతుకెల్ల । పరులమీాఁద
బరువుగామోసియాధార । పడియెనేఁడు
చేతిపనులెల్లపరులచేఁ । జిక్కిపోయె
ధరణినుయ్యాలవాడకో । దండరామా ॥ 22

సీ॥ భక్తివేఁకువలేచి । భగవానుఁ బ్రార్థించి
వేదపాఠ మొనర్చు । విప్రులేరి
యుదయంబునకుమున్నె । నదినిస్నాన మొనర్చి
సంధ్యవార్చెడియను । స్నాతలేరి
తులసిబిల్వముపత్రి । తుమ్మిపుష్పాలదేవ
పూజలొనర్చెడి । పుణ్యులేరి
యర్ధాంగితోఁడఁబ్రి । యహోమాగ్ని వేల్చెడి
నియతాత్ములగుధర్మ । నిష్ఠులేరి
తే॥గీ॥ యతిథిపూజలొనర్చి తా । మారగించి
భాగవతముఁ జదివెడి । భక్తులేరి
కరముమస్సహామయ్యెను । గాలమహిమ
ధరణిసుయ్యాలవాడకో । దండరామా ॥ 23

సీ॥ స్నానంబటన్నను । చలిజనియించును
సంధ్యవార్చుమటన్న । జ్వరమువచ్చు
బ్రహ్మయజ్ఞంబన్న । బహుకంపముదయించు
దేవతార్చనయన్న । డిగులుపుట్టు
నతివాసదిసమన్న ! నాయాసమొదవును
పర్వమటన్ననా । పదసెలంగుఁ
దర్పణంబన్నను । దలనొప్పిసేకూరు
శ్రాద్ధమన్ననుజావు । సంభవించు
తే॥గీ॥ పైతృకక్రియలన్నను । బ్రళయమగును
పాతులీగతికర్మవి । భ్రష్టులైరి
యిట్టిదుష్కాలమేర్పడె । నేమనందు
ధరణిసుయ్యాలవాడకో । దండరామా ॥ 24

సీ॥ అగ్నికార్యంబుల । నాచరింపుమటన్న
సిగరేట్లచేతనుఁ । జేయఁబడియె
నజినధారణము । ఖ్యమటన్న నడుముల
బెల్టనుతోల్పట్టఁ । బెట్టఁబడియె
దండంబుకరమున । ధరియింపుమన్నను
బ్యాటెప్పుడును చేతఁ । బట్టఁబడియె
వీర్యసంరక్షణ । విధియన్న గణికామ
తల్లులకుత్తుల । దాచఁబడియె
తే॥గీ॥ గరము వేదోక్తవిద్యార్థి । గణముచేత
బ్రహ్మచర్యంబు సలుపగాఁ । బడియెనిట్లు
చెప్పవశమా నేకలికాల । చేష్టలకట
ధరణినయ్యలవాడకో । దండరామా ॥ 25

సీ॥ కత్తిరింపులజుట్లు । కాళ్ళచుట్టునుకట్లు
కనులకద్దపు పట్లు । కప్పదాట్లు
కేలక్యాటరిలైటు । యాలరుసిగరేటు
శిరమందునొకహ్యాటు । సిల్కుకోటు
పాదంబులకుబూటు । పైకెంతయోనీటు
చమువుడబ్బాటు హా । స్తమునక్యాటు
వెనువెంటనొకకుక్క । విసవనొకపక్క
నబ్బుదువ్వెనచెక్క । చామచుక్క
తే॥గీ॥ యిట్టివేషంబులను వేసి । యిల్లువాసి
మెలఁగెనిప్పుడు విద్యార్థి । కులముఁగాంచ
నార్యవిద్యార్థిపద్ధతు । లణఁగిపోయె
ధరణినయ్యలవాడకో । దండరామ ॥ 26

సీ॥ అలుకఁ జనించిన | నమరాధిపతినైన
భ్రష్టుఁ జేసెడిముని | ప్రవరులేరి
సదనుగ్రహముగల్గ | జండాలునైన
స్వర్గమిచ్చెడి ఋషి | వర్యులేరి
యుపచారమొనరింప | నాదివిష్ణువునైనఁ
గాల దన్నెడి తప | స్వులులేరి
తప్పులొనర్చిన | దండహస్తునినైన
దండింపఁ జాలు స | ద్ధర్ములేరి
తే॥గీ॥ వేదజపములు తపములు | నియమములును
మంత్రతంత్రంబులెల్లను | మంటఁ గలిసె
శాపములనుగ్రహంబులు | సాఁగవయ్యె
ధరణినుయ్యాలవాడకో | దండరామా ॥ 27

సీ॥ కనువిప్పుమాత్రన | గలఁ జురక్కసిపిండు
భస్మంబొనర్చెడి | పరమమునులు
బొమముడిమాత్రన | పొగరుబోతులనెల్ల
దెగటార్పఁ జాలు ప | తివ్రతలును
కలముఁ బట్టినమాత్ర | గర్వాంధనృపతుల
గడగడలాడించు | కవివరులును
కత్తిఁ బూనినమాత్ర | ఘనవైరికులములఁ
దల్లడిల్లఁగఁ జేయు | దండిమగలు
తే॥గీ॥ విరివిగానుండినట్టి యీ | భరతభూమి
వేయికొకరైన లేరైరి | విత్తమెల్ల
వెడలిపోవీధి వైచిన | పెట్టెయయ్యె
ధరణినుయ్యాలవాడకో | దండరామా ॥ 28

సీ॥ పర్ణశాలలయందు । వసియించువిప్రులు
వరసౌధములకాస । పడిరినేఁడు
కౌపీనముధరించి । కదుమించుపాఱులు
పట్టుశేల్వలకాస । పడిరినేఁడు
పరిగెధాన్యంబులు । భక్షించుబ్రాహ్మణుల్
వరభక్ష్యములకాస । పడిరినేఁడు
పాదసంచారులై । వర్తించుభూసురుల్
వాహనంబులకాస । పడిరినేఁడు
తే॥గీ॥ పరులసౌఖ్యముకై నిష్ఠ వదలుద్విజులు
బహువిధసౌఖ్యంబులకునాస । పడిరినేఁడు
ఇట్టివిపరీతచర్యల । నేమనందు
ధరణినుయ్యాలవాడ కో । దండరామా ॥ 29

సీ॥ స్నానసంధ్యార్చన ప్రీ । దానకాలంబెల్ల
కాఫీహోటళ్ళలోఁ । గడచిపోయె
నతిథిపూజాదేవ । తార్చనాకాలంబు
దినముక్షురకర్మ । దీసికొనియె
బ్రాహ్మయజ్ఞయుత । ర్పణవిధికాలంబు
చీట్లపేకాటలఁ । జెల్లిపోయె
సత్కథాశ్రవణంబు । సలిపెడికాలంబు
కాఫీపుదువ్వటలోన । గలసిపోయె
తే॥గీ॥ విప్రులేయిట్లుత్తమవేద । విధులవీడ
బ్రాహ్మణేతరకృత్యముల్ । వారియందరమె
వర్ణధర్మంబులన్నియు । వనముఁజేరె
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 30

సీ॥ కనస్వరాజ్యోద్యమ । కారకుల్ వీరని
గూర్తిఁ జేయుచు రాజు । లాగ్రహింప
వేదోక్తకర్మలు । వీడఁ జేసిరటంచు
నలుగుచు వైశ్యుల । నాశపింప
చదువులలో మాకు । గొదువఁ జేసిరటంచుఁ
గోపంబు శూద్రులు । గ్రుమ్మరింప
నస్పృశ్యులంగ మమ్ము । నవలఁ ద్రోసిరటంచు
పంచముల్ చెలరేగి । పరిభవింప
తే॥గీ॥ నన్ని జాతులు విప్రుల । యందు రేగి
కాలుచిచ్చు విధంబునఁ । గనలుచుండ
పాలులకు నిల్వనీడఁ జూ । పట్టదిచట
ధరణినుయ్యాలవాడ కో । దండరామ । 31

సీ॥ భంగినమ్మచునుండు । బ్రాహ్మణుండొక్కఁడు
సారాయినమ్మెడు । పాఱుఁడొకఁడు
అభినమ్మచుండెడి । యగ్రజన్ముఁడొకండు
బీడీలనమ్మెడి । విప్రుఁడొకఁడు
పూటకూళ్ళను బెట్టు । భూసురుండొక్కఁడు
కాఫీనమ్మెదు జన్ని । గట్టొకండు
కడగిసిగరేట్లన । మ్మెడి ద్విజుఁడొక్కండు
బూడ్సులమ్మెడు । బాడబుండొకండు
తే॥గీ॥ పాపమరయక వైదికుల్ । బ్రాహ్మ్యవృత్తి
పోవిడచి నేడు జట్టెకు । పొట్టకొఱకు
సిట్టివ్యాపారములను జే । పట్టిరకట
ధరణినుయ్యాలవాడ కో । దండరామ । 32

సీ॥ చెప్పెడివెల్లను । శ్రీరంగనీతులు
శయనస్థలములు వే । శ్యాగృహములు
తిప్పెడివెల్లను । దివ్యాక్షమాలలు
చిత్తముల్ పరధన । స్త్రీహారములు
కప్పెడివెల్లను । గాషాయవస్త్రముల్
చేష్టలు ధర్మ వి । చ్ఛేదకములు
నొప్పెడివెల్లన । త్యుత్తమచిహ్నముల్
మాటలెల్లనువట్టి । బూటకములు
తే॥గీ॥ వేషభాషల వేదాంత । విదులఁబోలి
పుణ్యపాపంబులరయక । భువిజనముల
మోసగింపదొడంగిరి । మూఢవృత్తి
ధరణిసుయ్యాలవాడ కో । దండరామ ॥ 33

సీ॥ జేరంబులోఁ గొంత । ప్రియము లాఁడియు గొంత
సరకులోపలఁ గొంత । సంగ్రహించి
నక్కుడలో గొంత । తగురాళ్ళలోఁ గొంత
తూంకంబులోఁ గొంత । సేకరించి
కొలతబిద్దలఁ గొంత । గుణితంబులోఁ గొంత
కొలుచుటలోఁ గొంత । తొలగద్రోసి
పళ్ళలోపలఁ గొంత । పట్టుటలోఁ గొంత
పాటలోపలఁ గొంత । బడయనేర్చి
తే॥గీ॥ యందఱునుజూచుచుండ ద్ర । వ్యంబుదోచ
దొడగిరెంతయు బీదల । కడుపుగొట్టి
నీతిలేదయ్యె నేమి వా । ణిజ్యవృత్తి
ధరణిసుయ్యాలవాడ కో । దండరామ । 34

సీ॥ బాపలను ద్వేగ । పదవినంచగ రాదు
పెండ్లిండ్లకను వారి । బిలువరాదు
చేరివారిని భక్తి । సేవింపగా రాదు
చేననుస్కారంబు । సేయరాదు
పూనిపౌరోహిత్య । ములను సల్పగరాదు
విప్రపురాణముల్ । వినగరాదు
కడుబీదవారైన । కాసివ్వగారాదు
దయవారిపైనింత । దలపరాదు
తే॥గీ॥ అనుచు ధరణీసురులనిట్లు । నాదరించు
బ్రాహ్మణేతర పక్షముల్ । బయలుదేరె
విప్రులన్నను జనులకు । వెగటుదోచె
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 35

సీ॥ కాషాయ వస్త్రముల్ । గట్టినమాత్రనఁ
బరమసుజ్ఞానంబు । ప్రాప్తమగునె
బోలెడుభస్మంబు । బూసినమాత్రనఁ
పూర్ణమైనవిరక్తిఁ । బొందవశమె
గళమందురు ద్రాక్షఁ । గట్టినమాత్రన
నాత్మసందర్శన । మబ్బఁగలదె
కరమందు దండంబు । ధరియించు మాత్రన
భవబంధనిగళముల్ । పాయఁగలవే
తే।గీ। కడుపుకూటికినేను । లోకంబునందుఁ
గపటయతివేషములఁదాల్పఁ । గడఁగిరకట
నిక్కమౌ యోగిజనులకు । దిక్కుగలదె
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 36

సీ॥ పైరెండుచున్నది । సీరొసంగుమటన్న
చేరొక్క మోవరు । శీరుగోరు
మరణపత్రము రిజ । ష్టరు చేయువలెనన్న
సబ్ రిజిష్ట్రారు లం । చమ్ముగోరు
దరఖాస్తుపైభూమి । దయ సేయువలెనన్న
కామ్యానతనకుపై । కమ్ముగోరు
పశువునమ్మితిధృవ । పత్రిమిమ్మనగ్రామ
మునసబువ్రాతమా । మూలుగోరు
తే॥గీ॥ వీరువారనరాదధి । కారులెట్లు
ప్రజలపైనింతదయలేక । బహువిధముల
గరముపీడింపసాగిరి । కష్టమయ్యె
ధరణినయ్యలవాడకో ♦ దండరామ ॥ 37

సీ॥ కులమునురూపంబు । గుణముపిద్యయునింటి
తనమునుధనమును । తగినవయసు
నిల్లువాకిలిభూమి । యిష్టబంధుత్వంబు
గ్రామసౌకర్యంబు । గౌరవంబు
గ్రహమైత్రమాదిగా । గలపొంతనంబులు
సాముద్రికంబును । జాతకంబు
పంచాంగశుద్ధి శు । భగ్రహసంపత్తి
లగ్నబలంబు తా । రాబలంబు
తే॥గీ॥ పరిగణింపకనిర్దయ । స్వాంతులగుచుఁ
బశువులనుబోలె । గన్యలబరులకమ్మ
కష్టములఁగూర్చఁదొడగిరి । కన్నవారె
ధరణినయ్యలవాడకో ♦ దండరామ ॥ 3౮

సీ॥ నూఱురూప్యములున్న । గోరుచుండును వేయి
వేయిగల్గిన పది । వేలుగోరు
పదివేలుగల్గిన । పరఁగ లక్షనుగోరు
లక్షగల్గిన పది । లక్షలరయు
పదిలక్షలనుగల్గ । పడి కోటికాఁగోరు
కోటిగల్గిన పది । కోట్లనెంచు
పదికోట్లుగల్గిన । పార్థివత్వముగోరు
పదియుగల్గిననింద్ర । పదవిగోరు
తే॥గీ॥ అంతమొఱఁగనిత్తృష్ణచే । నర్థమునకు
దాసులై చిత్తశాంతి నం । తయునులేక
పాపములొనర్చి దుర్గతుల్ । బడయుచుంద్రు
ధరణినయ్యలవాడకో । దండరామ । 39

సీ॥ తమకున్న యంతలో । తనివినొందఁగలేక
యమితభోగంబుల । కాసఁజెంది
పనిపాటలను వీడి । పలు వాదములనాడి
పట్టుదుకూలముల్ । గట్టఁదొడఁగి
వ్యవహారములనుంచి । వ్యభిచారమొనరించి
వ్యాపారములమించి । వ్రతముఁబెంచి
యప్పులైకొనిదరిద్ర్య । మెప్పుడు పోటర్లు
రెళ్ళువకీళ్ళు [illegible] । టళ్ళకొసగి
తే॥గీ॥ కొనఁ ఋణములకొఱకె పెద్ద । సున్నజుట్టి
నాలికో యాప్తులకొ తమ । యాస్తులెల్ల
విక్రయమొనర్చువారలు । వెలసిరిపుడు
ధరణినయ్యలవాడ కో । దండరామ ॥ 40

సీ॥ తనయుండు గల్గినఁ । ధన్యుఁడౌదునటంచు
యనుదినంబును గద్దె । లడిగి యడిగి
సుతుఁ డుద్భవించినఁ । గతులు సేకురునని
పుణ్యతీర్థములందు । మునిఁగి మునిఁగి
కొడుకు జన్మించినఁ । గడతేర్పఁగలఁడని
పుట్టపుట్టకు వారు । పోసి పోసి
పుత్రుండు పుట్టినఁ । బుణ్యమబ్బునటంచు
చెట్టుచెట్టుకు సేవ । చేసి చేసి
తే॥గీ॥ కష్టములకోర్చి యాసతో । గన్నయట్టి
తల్లికిని గష్టమొదవించు । ధర్మరహితు
లుండినను లేకయుండిన । నొకటిగాదె
ధరణి నుయ్యాలవాడ కో । దండరామ ॥ 41

సీ॥ గంపెడాసలతోడ । గర్భంబు ధరియించి
యమితముగా వేవిళ్ళ । ననుభవించి
నెలలు తొమ్మిది మోసి । నిత్యమ్ము దిగులొంది
ఘనమైన ప్రసవవే । దనకునోర్చి
కష్టంబులెంచక । కనిరోతకు సహించి
యాకలిదప్పుల । కలఁతఁజెంది
కమ్మని పాలిచ్చి । కనురెప్పవలె పెంచి
ప్రేమతో బాలించి । పెద్ద జేసి
తే॥గీ॥ పెండ్లి పేరంటమొనరించి । ప్రేమ జూపి
నట్టి తల్లిని బాధించు । నట్టి మనుజ
పశువుల సుఖంబుఁ జూచిన । పాపమొదవు
ధరణి నుయ్యాలవాడ కో । దండరామ ॥ 42

సీ॥ నాగప్రతిష్టల । సాగించియులు వేల్పు
పూజకై ద్రవ్యంబు । ముడుపుఁగట్టి
తద్దయుశ్వత్థ ప్ర । దక్షిణంబులఁ జేసి
సత్యనారాయణ । స్వామిఁ గొలచి
మదనగోపాలాఖ్య । మంత్రంబు పాసించి
హరివంశ పఠనంబు । లాచరించి
మహితవైద్యులచేత । మందులెన్నియొ తిని
గోసాయియంత్రముల్ । గొనిధరించి
తే॥గీ॥ కొడుకులెంతయొ సౌఖ్యంబు । గూర్తురనుచుఁ
గన్నతల్లిదండ్రులకును నే । డన్నమిడక
కష్టపెట్టుదురేమందు । కాలమహిమ
ధరణినుయ్యాలవాడ కో । దండరామ॥ 43

సీ॥ యిల్లాలు పరులకు । నిల్లువాకిలియల్కి
బియ్యంబుదంచియు । బిండివిసరి
పిల్లలేడ్చుచునుండ । పెరుగుబాలమ్మియుఁ
గష్టంబులకునోర్చి । గడ్డిదెచ్చి
మండువేసంగిలో । నెండకుఁ బనిఁ జేసి
శ్రమరోడ్లకంకర । రాళ్లుగొట్టి
పోరుబిడ్డలను ప । ప్పులనైన గొననీక
దినదినంబును బూర్తి । తిండితినక
తే॥గీ॥ కూడబెట్టినదుడ్డు చే । కొనియుదాని
గొట్టితిట్టుచు కల్లుకై । పెట్టుజనుల
క్రూరకృత్యమ్ముదలచిన । గుండెలవియు
ధరణినుయ్యాలవాడ కో । దండరామ॥ 44

సీ॥ వడ్లు బియ్యముదంచి । భార్య సంపాదించు
దవ్యంబు కల్లు ముం । తకునుగొట్టి
ఎండలోపలమాడి । యింతిచేకూర్చిన
విత్తిని కేడిల । పాలుచేసి
కట్టె మోపులదెచ్చి । కాంత యార్జించిన
రొక్కంబు సారాయి । కుఱ్ఱకిచ్చి
కూలి నాలికిఁబోయి । కోమలిగూర్చిన
దుడ్డెల్ల నల్లమం । దునకుఁబెట్టి
తే॥గీ॥ స్వార్జితమునేని దినసీక । యాలిగొట్టి
చిట్టునట్టికి గాతుల । పొట్టఁజీల్చి
మట్టుబెట్టిన పాపంబు । చుట్టుకొనునె
ధరణిసుయ్యాలవాడ కో । దండరామ ॥ 45

సీ॥ పలుకష్టములకోర్చి । బహుళ సౌఖ్యంబుల
సమకూర్చునది కుల । సాధ్వికాదె
యాపత్తులందు త । న్నండగాను నెడఁబాయ
నెడబాయకుండిన । దింతిగాదె
గౌరవంబు యశంబు । ఘన సుకృతంబును
గలిగించునదికుల । కాంతగాదె
ధర్మార్థకామ స । త్కర్మంబులకు నెల్ల
నాకరంబైనట్టి । ల్లాలుగాదె
తే॥గీ॥ యగ్నిసాక్షిగఁ బెండ్లాడి । నట్టినతిని
క్రూరకృత్యమ్ములొనరించి । పారఁదోలు
పరమ చండాలురను జూడ । బాపమొదవు
ధరణిసుయ్యాలవాడకో । దండరామ ॥ 46

సీ॥ బాల్యంబు పూర్తిగాఁ । బాసిపోయకమున్న
పుట్టింటిపైఁబ్రేమ । బోనడంచి
పదిపదా రేండ్లైన । వచ్చిరాకయుమున్న
తల్లిదండ్రులఁబ్రేమ । లెల్లఁబాసి
యౌవన విస్ఫూర్తు । లంది యుండకమున్న
ముసలమ్మ గోములు । మూలఁద్రోసి
యాటపాటలకాంక్ష । లాగియాగకమున్న
చెలులనఖ్యంబెల్ల । తొలగఁజేసి
తే॥గీ॥ కాపురము సేయవచ్చిన । కామినులను
గరుణ జూడక మిక్కిలి । కష్టపెట్టు
వారు మనుజులె క్రూరస । త్వములుగాక
ధరణి నుయ్యాలవాడకో । దండరామ 47

సీ॥ సీమంతి నీత్వాల । క్ష్మని దెల్పు చక్కని
పాపటల్ వక్రత । బడకుఁజొచ్చె
దాంపత్య ధర్మత । త్వము దెల్పుమంగళ
సూత్రబంధము నైచ్య ! పాత్రమయ్యె
దీర్ఘమాంగల్యంబు । దెల్పు కుంకుమబొట్టు
లావగింజలకన్న । నణువులయ్యె
సతత పతివ్రతా । చరణ దీక్షాచిహ్న
కంకణధారణల్ । కలుషమయ్యె
తే॥గీ॥ నకటపాశ్చాత్య నవనాగ । రకతవచ్చి
హైందవ స్త్రీల భావమ్ము । లందునిల్చి
పావనాచార సాధుసం । ప్రత్తినణచె
ధరణినుయ్యాలవాడకో । దండరామ । 48

సీ॥ పతిని దైవంబుగ । భావించి నిరతంబుఁ
బరిచర్యఁ జేసెడి । పడతులేరి
యుత్తమామలమాట । కడ్డుమాటాడక
భక్తినారాధించు । భామలేరి
తోడికోడండ్రను । దోఁబుట్టువులరీతి
జూచిమైత్రి మెలఁగు । సుదతులేరి
గావల మఱఁదుల । బంధుజనంబుల
గౌరవంబుగఁ గాంచు । కాంతలేరి
తే॥గీ॥ విశ్వమంతయుఁ గాలించి । వెదకిచూడ
నక్కజంబుగ నూటికి । నొక్కరైన
గలరొ లేరొ గదా నేఁటి కాలమందు
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 49

సీ॥ బ్రష్షులే కుండిన । పల్లు దోముట గాదు
సీమమల్లువగాని । చెమ్మబోదు
సబ్బులేకుండిన । స్నానమాడఁగ రాదు
సెంటులేక సుగంధ । మంటఁబోదు
భారతవస్త్రముల్ । పైసోకఁగారాదు
బెల్టు లేకయుచీర । బిగువురాదు
బిస్కతులేకున్న । పిల్ల యేడుపుబోదు
కాఫిలేకయుపూట । గడవఁబోదు
తే॥ పాశ్చాత్యవస్తువుల నిత్యజీవితా । భ్యాసమిటు వి
[illegible]రా । ధనమయ్యెఁ
కాలగర్భమునందేమి । గలదొ యింక
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 50

సీ॥ కాఫీగింజలు లేవు । కాపురంబెట్లేను
గాలఁబెట్టుదునంచు । గసరునొకతె
యుల్లను లేదయ్యొ । పిల్లలజడ కేమి
పెట్టివేయుదు నంచుఁ । దిట్టునొకతె
పావుసబుంబోయె । స్టౌ దెచ్చియీవున్న
వంటకాఁబోదని । వదరునొకతె
సబ్బింటలేదయ్యొ । స్నానమెట్లాగని
యొ చీరిపనుచు గ । ద్దించునొకతె
తే॥గీ॥ భారతాంగనలాత్మీయ । పాత్రిణి భులఁ
కటకటాయిట్లు వేధింప । గడగిరి డ్లొ
కాపురంబులు నేడటి । కష్టమయ్యొ
ధరణినుయ్యాలవాడ కో । దండరామ॥ 51

సీ॥ కిరసనాయిల్ నేడు । కించిత్తు లేదాయె
పొత్రియుమంట లెటు సేయ । బోదుననుచు
వ్యాసెలైను లేదాయె । పడుచులకే నేను
పూసిజడల్ వేసి । ముడుతుననుచు
బ్యాటరి లేదాయె । పనులకీపూటగా
తిరిబైట నెట్లు వ । ర్తింతుననుచు
చక్కెర లేదాయె । నొక్కపూటైనను
సంసారమెట్టుల । సాగుననుచు
తే॥గీ॥ భారతాంగన లిట్టుల । బల్కునుడులు
భర్తలకు నేడు నిత్యాను । భవములయ్యె
నవ్యనాగరికతయిట్లు । నాట్యమాడె
ధరణినుయ్యాలవాడ కో । దండరామ॥ 52

సీ॥ పురుషులే గడిగిముం । దర పాపటల్ దీర్ప
పడతులపాపటల్ । పక్కకొదిగె
పైపైకిపురుషులే । బనియనుల్ ధరియింప
స్త్రీలకంచుకములు । క్రిందికిదిగె
కరములపురుషులే । కంకణంబులఁదాల్ప
సతులకుగాజుల । సహ్యమయ్యె
విడువకపురుషులే । బెట్టులంబెట్టంగ
వెలదులయొడ్డాణ । ములుదొరంగె
తే॥గీ॥ పురుషులే స్త్రీయలంకార । ములుగ్రహింప
మానినీపద్ధతులుఁ గూడ । మార్పుజెందె
హైందవాకయమెల్ల వ్య । త్యస్తమయ్యె
ధరణినుయ్యాలవాడకో । దండరామ॥ 53

సీ॥ చనుబాలొసంగయా । వనమెల్లఁజెడుసని
పసిబిడ్డలనుదాది । పాలుచేసి
భాసవచ్చెడివేళ । పనులకడ్డంబని
చిన్నవాండ్రి । జవానుచేతఁబెట్టి
బడివేళకాహార । మిదుటకష్టంబని
పిల్లల కాఫీహోటళ్ళకంపి
విద్యార్థి దశనాత్మ । విద్యనీచంబని
పరవిద్యలకు బొస్టల్ । పాలొనర్చి
తే॥గీ॥ యకట తలిదండ్రిలిటుజన్మ । మాదిగాగ
సుతులపోషణమన్యసం । గతినొనర్ప
నెటులస్వాచార ధర్మంబు । లెనఁగఁగలవు
ధరణినుయ్యాలవాడకో । దండరామ । 54

సీ॥ పాశ్చాత్య విద్యచే । భరతదేశంబున
భోగలాలసబుద్ధి । పొడముటయును
కలయిల్లు భూమియు । ప్పాలవాండ్రకొసగుట
యధిక దుర్వ్యయముల । కలవడుటయు
దల్లిదండ్రులమాట । తప్పవిపించుట
యన్నదమ్ముల మైత్రి । సున్నయగుట
స్వమతధర్మములవి । శ్వాసంబుతగ్గుట
యధికారులకునాత్మ । నమ్ముకొనుట
తే॥గీ॥ వేషభాషాధి పద్ధతుల్ । వేరయగుట
యధికమైన యహంకార । మలముకొనుట
లిట్టిదోషంబులెన్నియో । చుట్టుకొనియె
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 55

సీ॥ బాలుర నింగ్లీషు । బడిచేర్చివది మొదల్
బీ. యల్. పరీక్షగా । వించువరకు
పూటకూళ్ళకుఁబెట్టు । పుస్తకంబులకును
రాకపోకలకును । పోకలకును
నెలజీతములపరీ । క్షలకాఫి హోటళ్ళ
సెలవులకయ్యెడిదుడ్డు । సిలువచేసి
గురుకులవాసంబు । కొమరులకొడగూర్చి
హైందవవిద్యల । నభ్యసింప
తే॥గీ॥ జేసినిజవృత్తి గఱపియు । శ్రీయొసంగ
బరులదాస్యంపుఁగష్టము । పాలుగాక
స్వేచ్ఛ సుఖజీవనంబుల । జెలగరొక్కొ
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 56

సీ॥ అన్నదమ్ములు భాగ । మందఁజాలనిధనం
బన్ని వేళలచేతి । కబ్బుధనము
రాజులైననుగొన । రానియట్టి ధనంబు
కనియెవ్వరపహరిం । పనిధనంబు
సెలవైనకొలది ని । చ్చలు హెచ్చెడి ధనంబు
భయమింతయైనఁగొ । ల్పనిధనంబు
సుతులు బల్మినిగొన । చోటియ్యనిధనంబు
పరమస్వతంత్రమై । పరగుధనము
తే॥గీ॥ సఖలసౌఖ్యంబులను గూర్చు । నట్టిధనము
ధనములందెల్ల నుత్తమ । ధనమువిద్య
దానికీడైన ధనముభూ । స్థలినిగలదె
ధరణిసుయ్యాలవాడ కో । దండరామ॥ 57

సీ॥ తగుకోర్టులు వకీళ్ళు । లేఖచైనకొలఁదిని
ప్రజలలో వ్యాజ్యముల్ । ప్రబలమయ్యె
వైద్యులాస్పత్రులు । ప్రబలమౌకొలఁదిని
వెక్కురోగంబులు । పెరుగఁజొచ్చె
చెరలు పోలీసులు । పెరిగినకొలఁదిని
హత్యలు నేరంబు । లధికమయ్యె
నయ్యవార్లనుబళ్ళు । నధికమౌకొలఁదియో
నామాలరాక యేం । డ్లకునుమించె
తే॥గీ॥ నరుల సౌఖ్యంబులకుఁబ్రియ । త్నములోనప్ప
జగతిగష్టంబులెన్నియో । సంభవించె
కాలగతియెట్టిదోగాని । కాదు తెలియ
ధరణిసుయ్యాలవాడకో । దండరామ ! 58

సీ॥ మానవసంఘైక । మత్యున్నతంబును
విడగొట్టుగోడలి । వ్రేటువోటు
ప్రబల విరోధముల్ । పరిఢవిల్లఁగఁ జేయు
చొక్కమాజగడాల । చోటువోటు
మతిమంతులకునైన । స్మృతిఁజెడగొట్టెడి
కడుక్రూరమహాపాము । కాటువోటు
సత్యధర్మక్రియా । సత్సంప్రదాయపం
క్తిని బాపగానడ్డ । గీటువోటు
తే॥గీ॥ పెత్తనములేని వోట్పద । వికిభ్రమించి
కడగి సంసారమోటిదై । ఘనలు చెడిరి
లోకమెల్లను నేడు । చీకాకుపడియె
ధరణినుయ్యాలవాడ కో । దండ రామ॥ 59

సీ॥ ఒకవైపు బహుపాపి । యొకపైపు ఘనకోపి
మించివోటుకు దబా । యించుచుండ
నొకచెంపఋణదాత । యొకచెంపకులనేత
చూచివోటుకు చేయి । సాచుచుండ
నొకదిక్కుశూరుండు । నొకదిక్కుక్రూరుండు
రేగివోటుకు బెద । రించుచుండ
నొకచాయబలవంతుఁ । డొకచాయధనవంతు
డిరుపక్కలను వోటు । కీడ్చుచుండ
తే॥గీ॥ ముందుజన "నూయి వెనుకకుఁ । బోవగోయి"
యనెడిదుర్గతిబీదల । కబ్బె నేడు
నెచటనుండి యేతెంచెనో । యిట్టివోటు
ధరణినుయ్యాలవాడ కో । దండ రామ। 60

సీ॥ వోటియ్యకున్న నీ । పాటు చూడమటంచు
కనుబొమల్ ముడిపెట్టి । కసరునొకఁడు
వోటియ్యకున్న । బల్ఁ చేటుమూడునటంచు
కోపగించుచు । వేళ్లు చూపునొకఁడు
వోటియ్యకున్న । నీపూటనా పైకమ్ముఁ
నిచ్చిపొమ్మనిదబా । యించునొకఁడు
వోటియ్యకున్న । నింకేటి చుట్టరికంబు
చెడిపోఁగలదటంచుఁ । జెప్పునొకఁడు
తే॥గీ॥ వ్యాఘ్రములలోనఁ జిక్కిన । బక్కలేళ్ల
విధమునను బీదవారికి । వ్యధజనించె
వోటుచే దేశమునకిట్టి । చేటుగల్గె
ధరణినయ్యలవాడకో । దండరామ ॥ 61

సీ॥ ఆశలుఁజూపి వో । ట్లార్జించుటేగాని
బీదలగతిఁ దల । బెట్టఁబోరు
భయపెట్టి వోట్లు సం । పాదించుటేగాని
ప్రజలకష్టంబులఁ । బాపఁబోరు
బంధుత్వమని వోట్లు । వడయుచుండుటెగాని
యొక్కనాడైనను । దిక్కుపోరు
స్నేహమంచని వోట్లు । సేకరించుటెగాని
కడగంటనైనను । గాంచబోరు
తే॥గీ॥ నదినిదాటిన వెంటనే । నావగాల్చు
చందమునఁ జేయు శాసన । సభ్యులకట
జనుల పీడింపసాగిరి । చట్టములను
ధరణినయ్యలవాడకో । దండరామ ॥ 62

సీ॥ కలయాతలోననాఁ । కలిగొన్నవారికి
భుక్తికియ్యనివాని । పుట్టువేల
నున్నంతలోన నా । పన్నులకష్టముల్
వాపఁజాలనివాని । భాగ్యమేల
విన్నంతలో భక్తి । వినఁగోరువారికి
వినిపింపఁజాలని । విద్యలేల
తెలిసిన యంతలో । దీర్మానమొనరింపఁ
దగవుల విననిపె । ద్దరికమేల
తే॥గీ॥ నా చరణలేని శుష్కవే । దాంతమేల
భూతదయలేని ధర్మవి । న్మూర్తియేల
నిన్నుభక్తిదలంపని । నిష్టయేల
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 63

సీ॥ అన్యకామినియన్న । నంటుమామిడిపండు
కల్లయన్నమగల । కండపెళ్ళ
పరధనంబన్నను । బంచకజ్జాయంబు
మోసమన్నను లేత । దోసకాయ
పగలు గల్పించుట । పండుగ భోజనం
బపనిందగూర్చుట । యప్పళంబు
గేలిసేయుటప్రియము । గాలి తాంబూలంబు
పరదూషణంబన్న । బానకంబు
తే॥గీ॥ ప్రజలపీడించుటయటన్న । పదర ఫేణి
గాదలంచియుదుష్టులు । కడకువచ్చు
చేటెఱుంగక పాపముల్ । సేయుచుంద్రు
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 64

సీ॥ కైకొన్న ఋణములఁ । గ్రమతదీర్చెడివార
లున్నారె యిలనూటి । కొక్కరైన
దలిదండ్రులనుభక్తి । గొలుచుచుండెడివార
లున్నారె వేయింటి । కొక్కరైన
నన్నదమ్ముల మది । నతిమైత్రిగలవార
లున్నారె పదివేల । కొక్కరైన
పరధనంబులకాస । పడకయుండెడివార
లున్నారె ధరలక్ష । కొక్కరైన
తే॥గీ॥ సర్వభూతంబులనుమది । సమతఁజూచు
యోగులున్నారె భువికోటి । కొక్కరైనఁ
జిత్రమయ్యెను కాల వి । శేషమహిమ
ధరణినుయ్యాలవాడకో । దండరామ । 65

సీ॥ కోర్టుల కెక్కియుఁ । గూటసాక్ష్యము లిచ్చు
నీచులెంతయుగణ । నీయులైరి
భ్రూణహత్యలొనర్చు । క్రూరకిరాతకుల్
తత్వబోధలొనర్చు । దాంతులైరి
ధర్మంబులెల్లను । దలక్రిందుగాఁజేయు
మూఢులెంతయుజగ । త్పూజ్యులైరి
యప్పుల నెగఁగొట్టి । యన్యాయములొనర్చు
పాతకుల్ న్యాయపర । వక్తలైరి
తే॥గీ॥ శ్రాద్ధమొనరించునాఁడైన । బ్రహ్మచర్య
విధిఁజరింపనివారిల । విబుధులైరి
చోద్యమయ్యెను గలిచర్య । చూడఁజూడ
ధరణినుయ్యాలవాడకో । దండరామ 66

సీ॥ గణపతిపూజన । క్రమముగఁ దెలియని
వారుపురోహితు । లైరి నేఁడు
తిథిచారమైనను । తెలియఁజెప్పగలేని
వారిలజ్యోతిష్కు । లైరి నేఁడు
పిప్పలిగుణమైన । జెప్పఁగఁ దెలియని
వారువైద్యోత్తంసు । లైరి నేఁడు
గణయతిప్రాసల । క్రమమైనఁ దెలియని
వారుకవిశ్రేష్ఠు । లైరి నేఁడు
తే॥గీ॥ ధర్మశాస్త్రస్వరూపప । ద్ధతిదెలియని
వారుశాసన నిర్మాత । లైరి నేఁడు
ఏమిచెప్పుదుకలికాల । మిట్లు చెలఁగ
ధరణిమ్యాలవాడ కో । దండరామ ॥ 67

సీ॥ అన్నదమ్ములుతమ । యల్పధనంబుకై
కొట్లాడికొట్లాడి । కోర్టు కెక్కి
వైరంబులనుబూని । యూరిపెద్దలమాట
వినకభూముల నెల్ల । బీళ్లు వెట్టి
పనిపాటలనుమాని । ధనమెల్లకోర్టుఖ
ర్చులకు వకీళ్ళకు । సెలవు చేసి
మోటర్ల నెక్కియు । బూటకూళ్ళనుఁదని
విడువకెల్లైనన । పీళ్ళు చేసి
తే॥గీ॥ యలిగి హైకోర్టుదాకవ్యా । జ్యంబులాడి
గెలుచువారోడువారుప । కీరులైరి
యేమిదుష్కాలమనిదీని । నెన్నవలయు
ధరణిమ్యాలవాడ కో । దండరామ ॥ 68

సీ॥ ప్రజలబిడ్డలరీతి । పరిపాలన మొనర్చు
రాజులెంతయుపోత । రాజులైరి
ధర్మమార్గంబులఁ । దగవులఁదీర్చెడి
పెద్దలన్ననుగంగి । రెద్దులైరి
రణరంగములయందు । ప్రాణాలకుఁదెగించి
పోరుశూరులు మేక । పోతులైరి
నీతిధర్మంబుల । నిరతంబుబోధించు
పండితుల్ ముండల । మిండలైరి
తే॥గీ॥ ఆత్మధర్మసముద్ధర । క్షాత్రదీక్ష
పేరుఁజెందినధీరులు । భీరులైరి
తెల్పవశమానె కలిచర్య । దేవదేవ
ధరణినుయ్యాలవాడలో । దండరామ ॥ 69

సీ॥ కలిమినొప్పెడిభూమి । కఱవులకిరవయ్యె
నత్యనావృష్ట్యాదు । లధికమయ్యె
వేదవేదాంతాది । విద్యలల్పములయ్యె
బానిసవిద్యలు । ప్రబలమయ్యెఁ
కులధర్మములవెల్ల । గుట్టలపాలయ్యె
దారిద్ర్యపీడలు । దట్టమయ్యె
గనివినన్టిరో । గంబులు తరుచయ్యె
సుఖజీవనంబులు । శూన్యమయ్యెఁ
తే॥గీ॥ గల్లనిజమయ్యె సత్యంబు । చెల్లదయ్యె
తల్లిముల్లయ్యె దైవంబు । బల్లెమయ్యె
చూడఁగలిమాయ నేఁడతి । చోద్యమయ్యె
ధరణినుయ్యాలవాడలో । దండరామ ॥ 70

సీ॥ ధనవంతులకునుసం । తానంబుకలవయ్యె
పేదకుఁబుట్టెడు । పిల్లలైరి
ఘనదాతలకొకింత । ధనములేదయ్యెను
పరమలోభులుదరిద్ర । భరితులైరి
సన్మార్గపరులకు । సౌఖ్యంబు సున్నయ్యె
నతిదురాత్మకులుసు । శ్లాఘ్యులైరి
ఘనపండితాళికి । గౌరవంబరుదయ్యె
నీచులెంతయుపూజ । నీయులైరి
తే॥గీ॥ సత్యవంతునిమాటకు । జనులుకల్ల
యనృతవంతునకెందుఁబ । థంబుకొల్ల
కటకటాయేమిచెప్పుదుఁ । గాలమహిమ
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 71

సీ॥ సత్యవంతుండైన । సన్మార్గపరుఁడైన
విద్వాంసుఁడైన వి । వేకియైన
న్యాయవర్తనుఁడైన । నతిసమర్థుండైన
పరసాత్వుఁడైనను । సభ్యుడైన
కులధర్మపరుఁడైన । గుణవంతుడైనను
దాంతుఁడైనను, మహా । దారుఁడైన
దయగలవాఁడైన । తత్వజ్ఞుఁడైనను
ధీరుడైనను, శౌర్య । శూరుడైన
తే॥గీ॥ బీదవాఁడైనచోనదు । పీనుగంచు
శ్రీవిహీనునిమాటలు । చెల్లవయ్యె
గనఁగఁగడుఁచోద్యమయ్యెను । గాలమహిమ
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 72

సీ॥ బీదలకించైన | బిచ్చంబు వెట్టక
కడుపారఁ దమయింటఁ | గుడువఁబోక
యిల్లాలిఁ బిల్లల | నేనియు దిననీక
గట్టిగుడ్డలనైన | గట్టనీక
తగుబంధుమిత్రుల | దరిఁజేరనీయక
పెద్దగాదీపంబుఁ | బెట్టఁబోక
పుణ్యమ్ము నార్జింప | బొట్టైన నొసగక
చేధనంబించైనఁ | జెల్లనీక
తే॥గీ॥ నిత్యమెంతయు ధనకాంక్ష | నిద్రవోక
రేఁబవళ్ళును బలుమారు | లెక్కపెట్టు
మనుజపశువుల కేలధ | ర్మముల గోల
ధరణినుయ్యాలవాడ కో | దండరామ॥ 73

సీ॥ అతిపాతకుల చేత | యమలోకమందలి
నరకంబు లెల్లగ్రి | క్కిఱిసిపోయె
చిత్రగుప్తుని వ్రాతఁ | జెలఁగు దుష్కృతముల
లెక్కబుక్కన చోటు | లేకపోయె
పాపులఁ బీడింపు | పనిప్రవర్తించెడి
యమకింకరుల పని | యధికమయ్యె
కాలునికైనను | గనివిని యెఱుఁగని
దురితుల శిక్షింపఁ | దోచదయ్యె
తే॥గీ॥ జగతి సుకృతము నేఁడతి | స్వల్పమగుటఁ
బుణ్యలోకంబు లెన్నియో | మూతవడియె
కాలగతి యిట్టిదని చెప్ప | గావశంబె
ధరణినుయ్యాలవాడ కో | దండరామా॥ 74

సీ॥ శారదాశాసన । సంస్కారమున బ్రాహ్మ
పరిణయ పద్ధతుల్ । పాఱవడియె
వరస నాతనధర్మ । పరులబ్బురంబంద
విధవా వివాహముల్ । వెల్లివిరిసె
పరమపవిత్రదాం । పత్యధర్మంబుల
మూఁ సూత్రంబులు । మూలఁడాగె
పశువుల బేరంబు । వలెవధూవరులకై
బేరంబులెన్నియో । పెంపుఁజెందె
తే॥గీ॥ నార్షధర్మంబులన్నియు । నడఁచిఁ జేరె
జగతి వర్ణాశ్రమంబులు । సన్నమయ్యె
నకటయీపాడు నవనాగ । రకత జెలఁగె
ధరణినయ్యాలవాడకో । దండరామ ॥ 75

సీ॥ జనకుఁడుస్మార్తుండు । జననిమధ్వలబిడ్డ
కొడుకు శ్రీవైష్ణవ । కులమువాడు
తాతగణాచారి । తమ్ముఁడు క్రైస్తవుం
డన్న మహమ్మదీ । యావలంబి
మామలింగాయతి । మనుమఁడునాయరు
బావగారిది శెట్టి । బలిజకులము
మాతామహుఁడార్య । మతసాంప్రదాయుండు
బ్రాహ్మమతస్థుండు । బావమఱది
తే॥గీ॥ యొకకుటుంబమునఁజూడ । పెక్కుగతుల
కులమతంబులు నేఁడు సం । కులములయ్యె
కరముభిన్నమయ్యెను । కాలమహిమ
ధరణినయ్యాలవాడకో । దండరామ ॥ 76

సీ॥ పరమసాత్త్వికబుద్ధి । బలముగల్గినవారు
బ్రాహ్మణులనఁగ । నేర్పడిరితొల్లి,
శౌర్యశక్తియురజో । భావంబుగలవారు
క్షత్రియులనఁగ వి । ఖ్యాతిఁగనిరి
కసురజస్తమములు । గలకార్యదక్షులు
క్షితినివైశ్యులుగబ్రో । సిద్ధులైరి
సేవానిరతితమో । భావంబుగలవారు
పరగశూద్రులటంచు । బల్కఁబడిరి
తే॥గీ॥ సహజవృత్తులవీడిన । జాతులందుఁ
జూడబ్రాహ్మణులెవ్వరో । శూద్రులెవరొ
నిర్ణయింపఁగవశమానె । నేడుజగతి
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 77

సీ॥ పురుషసూక్తముదృశ్య । భువనంబునెల్లను
పరమేశ్వరస్వరూ । పంబటంచు
బ్రాహ్మణుండుముఖంబు । బాహుయుగ్మమురాజు
వైశ్యుఁడూరుయుగంబు । పదయుగంబు
శూద్రుండనివచించెఁ । జూడఁగనందులో
హెచ్చుతగ్గులకుతా । వెందునున్న
దంగంబులెల్లన । న్యోన్యసహాయంబు
లైతమవృత్తుల । నాచరింప
తే॥గీ॥ నేనుమొదవునుగాదేని । చేటుగల్గుఁ
దత్వమరయక కులవృత్తి । ధర్మములను
వీడిజగమెల్లనేఁడతి । పీడనొందె
ధరణినుయ్యాలవాడకో । దండరామ॥ 78

సీ॥ క్షితి నెల్లనావరిం | చినసముద్రమునందు
బహుముఖంబులనదుల్ | బహువిధమున
యానందమయపర | మాత్మ తేజమునందు
జంతుసంతతి తెక్కు | చందములను
మతధర్మనిర్ణీత | మార్గమ్ములంజని
దరిఁజేరితన్మయ | త్వంబునొందు
పలుతోవలేయైన | పరమార్థమొక్కటే
యనుటయందలిరహ | స్యార్థమనుచు
తే॥గీ॥ చాటిచెప్పిరి పెద్దలీ | జాడఁబోక
వాదభేదముల్ పెంచిమ | ర్యాదడించి
తగవొనర్చిన ముక్తిప | దంబుగలదె
ధరణిసుయ్యాలవాడ కో | దండరామ॥ 79

సీ॥ హిందూమతమహింస | యే శ్రేష్టమనిచెప్పె
నిస్లామ్మతముభ్రాతృ | హితమె తెల్పె
క్రైస్తవమతమురు | కారుణ్యమెవచించె
బౌద్ధాదిమతములు | బల్కెకృపను
మహిలోనమతముల | న్మర్మములన్నియునుఁగూడి
ప్రేమసూత్రమునందె | పేనుచెందె
మతసత్యమరసిన | మనుజులుక్రూరమౌ
పరపీడమునకుఁ | బాల్పడుదురె
తే॥గీ॥ యాచారమతమనిబాహ్యచి | హ్నములఁదాల్చి
నిర్దయస్వాంతులై మత | నిష్ఠయనుచు
హింసలొనరించధర్మమీ | మాంసయేడ
ధరణిసుయ్యాలవాడ కో | దండరామ॥ 80

సీ॥ సర్వభూతంబుల । సమతఁజూచెడివారు
కౌపీనమాత్రులై । గ్రాలువారు
పంచేంద్రియంబుల । బలమడంచినవారు
దివ్యతత్వములబో । ధించువారు
సుఖదుఃఖముల కాత్మ । చోటొసంగనివారు
ఘనతపోమహిమలఁ । దనరువార
లాత్మలాభంబుల । కాసఁజెందనివారు
ధర్మరక్షణమాత్మ । దలఁచువారు
తే॥గీ॥ విమలమతులైనమన్వాది । విబుధవరులు
శాస్త్రహితంబుగ వ్రాసిన । స్మృతులు జగతి
నప్రమాణంబులందురే । మందునింక
ధరణి నుయ్యాలవాడలో । దండరామ ॥ 31

సీ॥ ప్రభుసమ్మతములనఁ । బరగువేదములందు
గలయర్థమెల్లలో । కమునఁదెలుప
స్మృతులురచించిరి । శ్రమమొనర్చి సర్వ
సమతా మహర్షులు । సత్యబుద్ధి
నందలి తాత్పర్య । మవబోధ మొనరింప
భారతంబును వ్రాసె । వ్యాసమౌని
యదియె పంచమవేద । మనఁజెలంగెను ధర్మ
మలరఁబెక్కుపురాణ । ములలిఖించె
తే॥గీ॥ వేదవేదాంతసారమై । వెలసెగీత
యట్టిశాస్త్రప్రమాణంబు । లనృతమనిన
నింక ధర్మప్రమాణంబు । లేవొజగతి
ధరణి నుయ్యాలవాడలో । దండరామ 32

సీ॥ దేహంబుగాలిచేఁ । దిరుగుచునాడుచు
నేలఁగూలుచునుండు । గాలిపడగ
సంపదగన్గొన । సంభవించినశింకు
నిల్కడలేనట్టి । నీటిబుగ్గ
నిజకుటుంబముజూడ । నిఖిలజనంబులు
రహినెక్కిదిగుచుండు । రైలుబండి
సంసారసుఖములా । సలఁగొల్పిభ్రమయించి
యింతలోమాయమా । నెండమావు
తే॥గీ॥ లరయజగమెల్లస్వప్నతు । ల్యంబుగాదె
యేమినీమాయయోగాని । యిట్టిదనుచు
దెలియగారాదుబుద్ధిమం । తులకునైన
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ ౨౩

సీ॥ చలనంబులేకని । ర్మలముగానుండిన
జలమందువస్తువు । దెలియునట్లు
మనమునిశ్చలముని । ర్మలముగానుండిన
బ్రత్యక్షమగునందు । బ్రహ్మమూర్తి
యమనియమాదియో । గాభ్యాసమునగాని
చిత్తంబునిశ్చల । స్థితినిగనదు
సద్గురుసేవించి । శ్రవణమొందినగాని
నిర్మలమైబుద్ధి । నెగడదండ్రు
తె॥గీ॥ కర్మవిజ్ఞానభక్తియో । గములలోన
భక్తియోగంబుకడుసుల । భంబటందు
రైననీదయలేకని । స్తరయవశమె
ధరణినుయ్యాలవాడకో । దండరామ॥ ౨౪

సీ॥ పిండాండమందెబ్ర | హ్మాండంబిమిడియుండు
విత్తనంబునచెట్టు | వెలసినట్లు
మేరుపర్వతమన | మేనివీణాదండ
మరయంగశిఖరంబు | శిరముచూవె
భూర్భువస్స్వర్గాది | భువనంబులనసప్త
చక్రములైపైసహ | స్రారచక్ర
మదిసత్యలోకంబు | హంసస్వరూపివై
పద్మాసనస్థితి | బరగునిన్ను
తే॥గీ॥ సూర్యచంద్రాగ్నిఖ్యనాడులు | చుట్టితిరుగు
జ్ఞానవాహినిసదులచే | గరమువెల్గు
విశ్వమూర్తిగనిన్నుభా | వింతునయ్య
ధరణినుయ్యాలవాడకో | దండరామ॥ ౮౫

సీ॥ తనువులులాంతరల్ | తన్మధ్యమునవెల్గు
దీపంబువలెనాత్మ | తేజరిల్లు
సద్దంబులనుబోలి | యమరియుండునుమాయ
జ్ఞానంబుతైలంబు | గాజెలంగు
వెలుగొక్కడేయైన | పలురకమ్ములకాంతి
దనరారురంగుట | ద్దములబట్టి
అలాంతరలువర్ణయ్యు | నైపప్పడేకాంతి
యాదితేజంబులో | సంతరించు
తే॥గీ॥ జ్ఞానులదిగాంచిమాయను | లోనుగాక
నిష్కళంకాత్మనంతట | నిండియున్న
నిన్నెరుంగుదురన్యులు | నేరరింత
ధరణినుయ్యాలవాడకో | దండరామ॥ ౮౬

సీ॥ రథముశరీరంబు । రథికుండుజీవాత్మ
మనముసారథిబుద్ధి । మార్గదర్శి
భావింపజక్రిముల్ । దైవపౌరుషశక్తు
లశ్వముల్ పంచేద్రి । యములెతలప
యమని యమాదియో౹ । గములెపగ్గంబులు
రాజయోగమెమేలి । రాచబాట
కామాదిదుష్టత । స్కరబాధలనుమాన్ప
శ్రవణాదులేతగు । సాధనములు
తే॥గీ॥ పూనియీగతిజనిబ్రహ్మ । మూర్తివైన
నిన్నుఁజేరిసుఖింతురు । నిర్మలాత్మ
లన్యులకునిన్నుఁజేరంగ । నగునెదేవ
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 87

సీ॥ పరగజీవుఁడుబొందు । వదియావస్థలెపది
యుపకారములటందు । రాత్మవిదులు
మత్స్యకూర్మత్వముల్ । మఱిగర్భగోళమం
దవలవరాహత్వ । మర్భకదశ
బాలుఁడైనరసింహ్మ । భావంబునొందును
వామనత్వంబందు । వటువుగాగ
గార్హస్థ్యపరిణామ । గతుఁలమూటఁజెలంగు
గ్రుణరామావతా । రములుమూడు
తే॥గీ॥ పరమబౌద్ధతగను వన । ప్రస్థుఁడగుచుఁ
గడఁగిసన్యాసితక్క బొంది । కల్కిభావ
మొందువిజ్ఞానమొందుచుఁ । జెందునిన్ను
ధరణినుయ్యాలవాడకో । దండరామ ॥ 88

సీ॥ కర్మయోగమునందు । గలరహస్యములెల్ల
హరివివస్వంతున । కటవచించె
మనువుకాతఁడుదెల్ప । మహితశాస్త్రమువ్రాసె
నతఁడదియేమను । స్మృతిగనెగడె
శాస్త్రప్రమాణంబు । సత్యంబనియెగీత
జగతికార్యాకార్య । సంశయముల
సద్గీతోక్తికి । సద్గీతలువ్రాసి
మన్వాదిశాస్త్రముల్ । మంటఁగలిపి
తే॥గీ॥ సత్యమరయక సంఘ సం । స్కారమనుచు
భీతియిసుమంతయునులేక । విచ్చలవిడి
కరమకృత్యములను జేయ । గడగిరిప్పు
ధరణినయ్యలవాడకో । దండరామ । 89

సీ॥ సంసారమెల్ల బ్రి । చ్ఛన్నమౌచెరసాల
మమకారమెల్లను । మాయగుంట
పంచేంద్రియంబులు । పొంచిమ్రింగెడిపులుల్
విషయభోగంబులు । విషఘుటికలు
కామంబుక్రూర దు । ష్టకాలసర్పంబు
కోపమెంతయుఁబోరి । గొనెడిమిత్తి
గర్వంబుదరికొని । కాల్చెడికార్చిచ్చు
కరము మోహంబెల్ల । కాళరాత్రి
తే॥గీ॥ యాత్మవిజ్ఞానమింతైన । నరయలేకఁ
జిక్కుబడితినినాకిక । దిక్కునీవ
కరుణఁబ్రోవుమునీకటా । క్షంబొసంగి
ధరణినయ్యలవాడకో । దండరామ । 90

సీ॥ జగతినపారమౌ । సంసారమేలంక
కామాదిగణమె రా । క్షసచయంబు
దశవిధేంద్రియముల । దనరుచుండుమనంబె
దనుజేశ్వరుండగు । దశముఖుండు
బుద్ధిసీతాదేవి । మోహాంధుఁడౌచుఁద
న్నరికట్టుగావను । నణచివేసి
నాత్మధ్యానించెఁద । దాజ్ఞఁబ్రాణాయామ
భవమూర్తియగువాయు । పట్టిగరిసి
తే॥గీ॥ లంకఁగాలిచిరక్షోబ । లంబుఁజిదిమి
వానిజూఁపగసీచేత । వాఁడుగూడిసె
నట్టినిచరితంబె రా । మాయణంబు
ధరణినుయ్యాలవాడ కో । దండరామ ॥ 91

సీ॥ సంసారమెల్లను । జల్వపందరిఅచ్చు
కూటంబుభార్యయు । గొడుకుఁదండ్రి
యన్నలుదమ్ములు । నాప్తవర్గంబులు
తమతమపనులకై । దరలివచ్చి
గుమిగూడిసఖ్యంబు । కొంతకాలముచూపి
యవసరంబులఁబట్టి । యరుగుచుండ
నాభార్యనాబిడ్డ । నాబంధువులటంచు
మమకారకూపని । మగ్నులగుచు
తే॥గీ॥ కర్మయోగరహస్యంబుఁ । గానలేక
చిక్కువెలిరాకజగమెల్లఁ । జిక్కువడియె
దేవనీమాయని సుమంత । దెలియవశమె
ధరణినుయ్యాలవాడకో దండరామ ॥ 92

సీ॥ నారికేళఫలంబు । నరఁజెలంగుకొబ్బెర
వలె మాయచేఁగప్పఁ । బడినయాత్మ
మూర్తి వౌనిక గన । నేర్తురేమూషులు
ప్రాక్తనసుకృతంబు । ప్రాపుగాఁగ
గురుబోధమని యెడి । కొడవలిచేఁబూని
యల్లిబిల్లిగపైన । నల్లుకొన్న
సంసారమనెడిని । స్సారమాపీచును
ముక్కముక్కలుగాఁగఁ । జెక్కివైచి
తే॥గీ॥ కర్మవిజ్ఞానభక్తియో । గమ్ములనెడి
కనులచేఁగాంచి మాయయఁ । గప్పుచిప్ప
గొట్టుయోగులు పొందఁగ । ల్గుదురుగాక
ధరణినుయ్యాలవాడకో । దండరామ॥ 93

సీ॥ మండుచుండెడియగ్ని । కుండముల్ పంచేంద్రి
యంబులోజ్వాల విష । యాళులందు
వ్రేల్చుచుండుకొలంది । వృద్ధియౌజ్వాలనుండు
నాల్కలార్చునుగాని । నవసిపోఁడు
యంతమెరుంగని । యభిలాషలనఁదీర్పఁ
జాలకదుఃఖసం । సారుఁడగుచు
పరులనుహింసించి । దురితంబులొనరించి
జనుఁడవివేకియై । సంతతంబు
తే॥గీ॥ పుట్టిగిట్టుచ దుర్గతుల్ । బొందుచుండు
కర్మయోగరహస్యంబుఁ । గనివిరక్తి
బడసివేదాంతిగనుచుండు । పరమశాంతి
ధరణినుయ్యాలవాడకో దండరామ॥ 94

సీ॥ జగము నాటకశాల । సర్వభూతంబులు
వేషముల్, తెర మాయ । వేదవేద్య
యంకముల్ కల్పంబు । లాద్యంతవిరహిత
నవరసభరితమీ । నాటకంబు
సూత్రధారుఁడవీవు । సూచించు వైఖరి
వేషంబులెన్నియో । వేయుచుండి
మదమత్సరములఁ । దన్మయుఁడనై యౌచిత్య
మరయ లేకీయాట । లాడుచుంటి
తే॥గీ॥ గాసిఁ జెందితిఁ నిక నైన । వాసుదేవ
కరుణమీరఁగ నన్నుఁబ్రి । కౄకునుఁ జేర్చి
సంతతానందముక్తినో । సంగవయ్య
ధరణినుయ్యాలవాడ కో । దండరామ 95

సీ॥ దారిగానక యొసం । సారాటవినిఁబడి
దిక్కుదోఁచక నేను । దిరుగుచుండ
బలవంతులైనట్టి । పంచేంద్రియంబులౌ
మ్రుచ్చులు వెన్నాడి । ముట్టడించి
విజ్ఞానధనమెల్ల । విషువకెంతయు ద్రోచి
కడఁకనిషణమను । గర్తమందు
బడద్రోసిరిట్టియా । పత్కాలమెఱఁగియు
రోష కామ క్రోధ । లోభములను
తే॥గీ॥ శత్రువుల్ తమబలగంబు । నందడింప
వచ్చిమిక్కిలి బాధింప । జొచ్చిరకట
దిక్కునీవగదా బ్రోవ । దేవదేవ
ధరణినుయ్యాలవాడ కో । దండరామ । 96

సీ॥ శరణాగతత్రాణ । బిరుదంబునీకేల
శరణాగతునినన్ను । సాకకున్న
దీనరక్షాదక్ష । దీక్షనీకేటికి
దీనునినన్ బ్రోవ( । బూనకున్న
ఆర్తజనావన( । ఘనుపేరునీకేల
ప్రబలమౌనాయార్తి( । బాపకున్న
దాసపోషకసము । ద్యత్కీర్తినీకేల
దాసునినన్నునో । దార్పకున్న
తె॥గీ॥ భక్తవత్సలయనినిన్ను( । బలుకనేల
భక్తినిను(గొల్చునన్ను( । గాపాడకున్న
గడ(గినన్నేలనింతయా । గడమదేల
ధరణినుయ్యాలవాడలో । దండరామ॥ 97

సీ॥ రామ పాసుగుణాకర । రామ దారివిభీకర
రామ పంకజాతాభ । రామ బ్రోవ
రామ హితప్రచార । రామ ముదముం(జూడ
రామ సీపిశుభాకర । రామపాహిక్ష్వ
రామ వసిజసుందర । రామ సుకులశేఖ
రామణిసగితపా । రామ నోపా
రామరుమాటేల । రామ సురుదవనాద
రామ రుత్సాంతవిహార । రామ నోడ్ష
తే॥గీ॥ రామ మునిభక్తజనశుకా । రామ విద్వ
రామ హేందాద్రిదిశేశ్రయసక । రామపాజ్డ
రామరణజన్మదుఃఖపి । రామమొసగ
ధరణినుయ్యాలవాడలో । దండరామ॥ 98

సీ॥ అరయఁగ శాలివా । హనశకాబ్దంబులు
షట్పంచగజచంద్ర । సంఖ్యలకును
నరయగు శ్రీభావ । సంవత్సరంబునన్
మధుమాససితపక్ష । నవమియందు
శనివాసరంబున । జరుగుపునర్వసు
నక్షత్రకటక ల । గ్నంబునందు
సద్భక్తి నీపద్య । శతకమర్పించితి
బాలకావ్యక్త సం । భాషణంబు
తే॥గీ॥ తండ్రి కానందమొసఁగదే । తప్పులున్న
కడకుద్రోయక యీకృతి । కరుణఁగొనియు
శాశ్వతానంద సిద్ధినొ । సంగవయ్య
ధరణినుయ్యాలవాడ కో । దండరామ ॥ 99

సీ॥ సకలచరాచర । జగములన్నియు నీవ
గ్రహతారకాగణా । కారమీవ
వాసుకిప్రభృతి స । ర్పప్రకాండము నీవ
తార్క్ష్యాదిపక్షి సం । తతియు నీవ
పనసనశ్వత్థాది । పాదపౌఘము నీవ
కపిలాదిసిద్ధ సం । ఘంబు నీవ
సంవత్సరర్తు మా । సదినాదులును నీవ
జ్ఞాతయు జ్ఞేయంబు । జ్ఞానమీవ
తే॥గీ॥ సర్వభూతాశయస్థిత । స్వామివీవ
క్షరము నీవ యెఱుంగఁ న । క్షరము నీవ
నిఖిలమును నీవ పరమేశ । నేను నీవ
ధరణినుయ్యాలవాడ కో దండరామ ॥ 100

# భరతవాక్యము.

గీ॥ అఖిలలోకంబులకు సౌఖ్యమబ్బుగాక ।
నృపులు పాడిగ ధరణి బాలింతురుగాక ।
ధర్మమెంతయు విరివిగ దనరుగాక ।
పాడిపంటలు జగతిపై బరగుగాక ।
వేదపారము లెల్లెడ వెలయుగాక ।
ఐకమత్యంబు ప్రజలకు నలరుగాక ।
దేశమెప్పుడు శుభముల దేలుగాక ।
శ్రీరఘూత్తము డెపుడు రక్షించుగాక ।

1938 వ సం॥ ఫిబ్రివరి నెల 18 వ తేదీన శ్రీ కోదండరామ శతక ముద్రిణ సహాయార్థము యింజేటిగ్రామస్తులను గురించి చెప్పిన ఉత్పలమాల.

---

ఉ॥ సాటియొకింతలేని గుణసాంద్రియశోవిభవాఢ్యులైనయిం
జేటిపురీనివాసి బుధసేఖరులార వచింతునే నిరా
ఘాటముగానెయొక్క శతకంబునుభక్తిమెయిఁ రచించివిూ
బోటివదాన్యులఁ గనియుముద్రిణకార్యము నిర్వహింపగా
నేటికివచ్చినాడగడు నేను హితుండ బురోహితుండమీ
వీటికి విప్రిడఁ గవిని వేదగృహస్థుఁడ దానపాత్రుఁడఁ
మాటలరీతిపద్యములు మాన్యులుమెచ్చఁగ నాశుధాటిలోఁ
బాటవమొప్పనాృియుఁగల పండితుఁడఁ మనదేశమందు నే
నాటికినొక్కఁడోకవి వినూత్నకృతిఁ రచియించువాఁడు నే
నేటికినింతజెప్పవలె నెల్లరకుఁ విదితంబకాదె,, క
కర్నాటధరావరుండయిన రాయలురాజ్యమునేలునాడహా
మేటికవీంద్రిలఁ బిలిచి మిక్కిలిమన్ననలిచ్చిప్రోిచెనీ
నాటికిదవ్యశంబును ఘనంబుగఁదెల్పదె వాగ్విధూటి శే
నాటిశరీర్త్రిలోపల గుణగ్రాహణుల్ గలరిప్డుకూడ మో
మోటమదేల తెల్పెదను ముద్రిణకైపిన యుమ్మనూరిలో
నూటపదార్లొసంగిర యనూనవిధిఁ వడి, మీరునట్టులే
పాటికినాటిజేయవలె పద్యశముఁ భువినొందగావలెఁ
మాటికిమాటికిఁ మిముల మాన్యములిచ్చునికోరఁబోనుదే

శాటనవృత్తితో నెపుడు యాచనజేసి యెరుకింగనేను నా
కూటికి గుడ్డకై యిటుల కోరగబోనిటుముద్రితార్థహా
రేటుభరింపరానిది యెఱింగియె వచ్చితి కందనూల్ పురీ
నూటికి వెయ్యిపొత్తము లనూనముగా ప్రచురించియిత్తు ర
ప్పాటధనంబు నేనొనఁగు భాగ్యములేమిని మిమ్ముజూడవి
చ్చోటికివచ్చినాడ నిది సూనృతమెంతయు నాదుభూమిలో
నేటికి రెండుమూర్లయిన నేర్పడి రావుకుటుంబమన్ననో
పూటకు నెట్టులైన బరిపూర్ణముగా నిలునిండునట్లు పెఱ
ళ్ళెడుగావలెన్ నిజము చెప్పినబూటకమండ్రు రాముడే
లోటును నాకొసంగఁడని లోనదలంచెద నట్టులెప్పుడే
లాటికొ అంతలీయక యిలన్ ననుబ్రోచెనుమీర లెప్పుడున్
గోటికొలంది పుణ్యములకుం[illegible]భక్తిని సల్పినారలే
కోటను బుణ్యతీర్థముల కేగియు ధర్మమొనర్చినారు నా
బోటులచే బురాణములు బుణ్యకథల్ చదివించినారు బల్
బాటలలోన వేసవిని బాంధులదాహముదీర్పచల్ల నా
నీటినొసంగివారలకు నిత్యసుఖంబొనరించినారు మేల్
తోటలుసత్రముల్ గుడులుతో రవుభక్తి నినిల్పినార లీ
లాటికృతిప్రిపోషణఫలంబును మీరిపుడొందగోరెదన్
నూటిగదవ్వులన్ గవినిజూచిన మాత్రనె లోభి యొతయున్
చేటికివచ్చునంచు దఱిజేరదు భీతిలిలోనదిట్టుచున్
జాటుకునేగుచుండు విధిజాలక కన్పడె నేనివట్టియా
రాటమొకాని కానియును రమ్మని ప్రీతినొసంగబోడెటుల్

గ టికిఁ గాళ్ళుసాపినను గెల్గునె ధర్మము చింతలోఁ భిక్
మాటలు వేయునేల ననుమన్న న సేయుఁడు నావిధానమున్
బాటిగ జెప్పఁబూనిసను బద్యములోపల నాల్గునల్వదై
గీటులుమించె నింకపొడిగింపక నిల్పెదనిట్టి నాదువా
గ్ధాటిని, మీకొసంగతినిదద్దయును త్పలమాలికాతతిన్
బూటకమిందులేదు తమబుద్ధికిఁ దోఁచినద్రవ్యమిచ్చి మేల్
దీటగుపుణ్యగార్యమును దీర్పుడు మీకిలరామ ర్తి బల్।
కీటగుభోగభాగ్యములు నిత్యమొసంగుచు బ్రోచుగావుతన్

—